# శ బ రి

ప్రణేత:

విద్వాన్. సహదేవ సూర్యప్రకాశరావు.

ప్రచురణ:

సహదేవ సదనము

47–1–14 దానవాయిపేట,

రాజమహేంద్రవరము



This book is Published with the financial astsistance of TIRUMALA TIRUPATHI DEVASTHANAMS under their scheme "Aid to Publish Religious Books"

శ బ రి

(శ్రీ) త్యాగరాజస్వామి

రాగము : ముఖారి

ప॥ ఎంతనినే వర్ణింతును శబరీ భాగ్య ॥మెం

అ॥ దాంతులు వరకాంతలు జగమంత
నిండి యుండగ ॥ఎం॥

చ॥ కనులార సేవించి
కమ్మని ఫలములనొసగి,
తనువు పులకరింప
పాదయుగముల మ్రొక్కి,
ఇనకులపతి సమ్ముఖంబున
పునరావృత్తిరహిత పద
మును బొందిన, త్యాగరాజ
నుతురాలి పుణ్యమును ॥ఎం॥

కావ్యనేత్రి కావ్యకర్త



శ్రీమతి డా. బొడ్డు కళావతి. విద్వాన్ సహదేవ.

శ్రమణి శబరీ శిరోమణి సచ్చరిత్ర
ఆశిషమ్ములతో మంగళాక్షతలతొ
అంకితంబిచ్చుచున్నాను. సాదరమున
శ్రీమతి కళావతీ సతి స్వీకరింపు

విద్వాన్ సహదేవ

కావ్యనేత్రి :

శ్రీమతి డా॥ బొడ్డు కళావతి M. B. B.S.

మాజీ శాసన సభా సభ్యురాలు.

అంకితము　　　　　　　　అక్షరాక్షతలు.

శ్రీచరణ మంజు మంజీర శింజితమ్ము
గిలుకరింపగ, హృదయమ్ము పులకరింప
మెల్లమెల్లన పాదమ్ము మెట్టినట్టి
రామచంద్రాహ్వయుండు నిన్నోమునాత !

సప్తసంతానమందు ప్రశస్తమైన
దొకటికావ్యము, వికచహేమోత్పలోజ్జ్వ
లమ్ము, నవభావనవరసలాలితమ్ము
కావ్య, మాచంద్ర తారకార్కముగ వెలుగు.

శ్రమణి శబరీ శిరోమణి సచ్చరిత్ర
నాశిషమ్ములతో, మంగళాక్షతలతో
అంకితమ్మిచ్చుచున్నాను సాదరమున,
శ్రీమతి కళావతీసతీ! స్వీకరింపు.

వైద్య విద్యా విశారదవనుచు, నీవు
సరస భావకావ్య పఠనాసక్తవనుచు,
మీదు మిక్కిలి నేను నీమేనమామ
ననుచు, నాకృతి నినుజేరమ నసుపడియె.

కాలపూరుష విన్యాస లీలలెన్నొ,
బండులోడలౌ ఓడలు బండులగును,
పూలు వికసించి మలిసంజరాలిపడును,
ఒకటి తలచి కార్యమున చేయునది యొకటి.

వైద్య వృత్తిని వీడి, నిస్స్వార్థరీతి,
దళిత పీడిత జన జీవితములు చక్క-
దిద్ది, విజ్ఞానరోచి కాంతిల్ల జేయ
దలచి, రాజకీయమ్ము చే దాల్చినావు.

నీయదార్థ వాక్కులకు, వినీతమతికి,
ధర్మతత్పరతకు, కార్యదక్షతకును,
జనత నీరాజనంబిచ్చె వినతితోడ,
అంతనీవు శాసన సభ్యురాలవైతి.

నీ నియోజక వర్గమ్ములో నిరంత
రప్రచార మొనర్చి, ప్రజాప్రయోజ
నమ్ముల నరసి, సమకూర్చినావు, తజ్జ
నానుమోదమ్ము చూఱగొన్నావు భృశము.

పాడి పంటలతోడి సంపత్సమృద్ధి;
అష్టభాగ్యాలతోడి వంశాభివృద్ధి;
ఆయురభివృద్ధితోడి యశోభి వృద్ధి;
తనరి, శుభజీవితమ్మున మనుము చిరము.

కావ్యప్రణేత.

కావ్య నేత్రి



శ్రీమతి డా. బొడ్డు కళావతి M. B. B.S.
మాజీ శాసన సభ్యురాలు.

మేనేజింగుడైరక్టరు,
కల్పనాపెనింగు మెటీరియల్స్ లిమిటెడ్,
విజయనగరము

కాంగ్రెస్ మహిళా విభాగ నిర్వాహక కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్.

కావ్యనేత్రి

# శ్రీమతి డా॥ బొడ్డు కళావతి, M. B. B. S.

మాజీ శాసనసభా సభ్యురాలు

జీ వి త రే ఖ.

విశాఖ ఆంధ్ర వైద్య కళాశాల నుండి M. B. B. S డిగ్రీ పుచ్చుకొన్న తదనంతరం E. S I వైద్యాలయంలో విజయనగరం మహా రాణీ వైద్యశాలలో, అసిస్టెంటు సర్జనుగా 1972 వరకు ఉద్యోగించినారు. ఆనాటి రాష్ట్ర పరిస్థితిని కూలంకషంగా అవలోడనము చేసికొని వైద్య వృత్తిని విడనాడి రాజకీయరంగ ప్రవేశము చేసినారు.

అ ప్పు డు :–

విశాఖ జిల్లాలోని మాడుగుల నియోజక వర్గము నుండి శాసనసభా సభ్యురాలుగా ఎన్నికైనారు. (1972–78)

మాడుగుల నియోజకవర్గ ప్రజానీకానికి ఏకైక కాంక్షయైన కోనము రాయివాడ రిజర్వాయర్సును నెలకొల్పుటలో విజయము సాధించినారు.

ఆంధ్ర విశ్వ కళాపరిషత్తులో సెనేటు సభ్యురాలుగా విశిష్టసేవచేసినారు.

ఆంధ్రోద్యమములో సమైక్యతా సంరక్షణ కోసం కృషిచేసినారు.

శాసనసభ్యురాలుగానున్న కాలంలో సబ్ తాలూకాగా ఉన్న మాడుగుల, తాలూకా కేంద్రముగా పరిణమించినది.

అంతర్జాతీయ మహిళా సదస్సులో, అఖిల భారత మహిళా సదస్సులో పాల్గొన్నారు.

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ వైద్య ఆరోగ్య సంఘ సభ్యురాలుగాఉన్నారు.
పెక్కు ప్రజోపయోగ సంస్థలలో సభ్యురాలుగా ఉన్నారు.

లఘు పరిశ్రమాభి వృద్ధి సంస్థకుదైరక్టరుగా ఉన్నారు.

ఇప్పుడు :–

మహిళా పారిశ్రామికురాలుగా ఆంధ్ర ప్రదేశ్‌కు ప్రాతినిధ్యమువహించు చున్నారు.

న్యూఢిల్లిలోని నేషనల్ అలయన్సు అఫ్‌యంగ్ ఎంటర్ ప్రీనర్సు (NAYE) సభ్యురాలుగా ఉన్నారు.

ఆంధ్ర ప్రాంతంలోని సెంటరల్ ఎక్సైజ్ ఎడ్వైజరీ సంఘంలో ఆంధ్ర రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా సంఘంలో సభ్యురాలుగా ఉన్నారు.

ఆంధ్రప్రదేశ కాంగ్రెసు మహిళా విభాగమునకు నిర్వాహకకార్యదర్శిగా ఉన్నారు.

1984 లో విశ్వ విఖ్యాతి నందిన రష్యాదేశమును సందర్శించివచ్చినారు.

ఎప్పుడు :–

సంఘ సేవ, గిరిజనసేవ, మహిళాసేవ, సద్గ్రంథ పఠనము, సద్గోష్ఠి, సత్కథా శ్రవణము, తీర్థయాత్రలు, అభిరుచులు.



# ఆమోదవృష్టి

'కవితా వాచస్పతి'
డా॥ చేబోలు చిన్మయ బ్రహ్మకవి M. A. Ph. D.

అద్యతనాంధ్ర సారస్వతలోకమున సుకుమార భావకవితకు పేరు మోసిన వారు మిత్త్రులు విద్వాన్ శ్రీ సహదేవ సూర్యప్రకాశరావుగారు. వారి రచనలు మున్నెనాడో రసజ్ఞుల ఆదరాభిమానములను చూఱగొన్నవి.

జీవితము సుఖదుఃఖ సంకులమయ్యును 'ప్రతీక్ష'యను నుత్కంఠ వలన ఆపాతమధురము, ఆనంద విస్మయ భావసంభరితమైయుండును. ప్రతిజీవి యీ లోకమున మునుముందేదోయున్నతిని బొందగలనను నాకాంక్షతో బ్రతికి యుండును. ఈయాకాంక్షయే మనుష్యుల మనుగడ కొకగొప్ప వరమన వచ్చును. ఈ నిరీక్షణలు రెండురకములు. క్షణభంగురములగు లౌకిక వాంఛలకై యెదురుచూచుట యొకటికాగా నిజమగు నానందప్రదాత యగు పరమాత్మ సందర్శనము కోరుట యనునది రెండవది, ఉత్కృష్టమైనది.

నిరాశానిస్స్పృహల కాఱు చీకట్లలో పెనగులాడు నరులకు – ఒకానొక నూత్నభావన–తన్మూలమగు నానందము నందీయ గలదే కవితా ప్రయోజనము॥ తన యనుభవములోని మానసిక పరిణతి–భావప్రకంపనమే కవి హృదయమునుండి యప్రయత్నముగా రసస్ఫూర్తిగల విద్యుల్లత–తళుక్కుమని మెఱయును. అందువలన నిద్రాణమగు భావుకుల భావ నాకాశమున క్రొంగ్రొత్తశోభ వెల్లివిరియును.

తెలుగు సాహిత్యరంగము కాలానుగుణముగా పెక్కుమార్పులను జెందుచు 'నిత్యనూతన జీవనస్రవంతి' వలె నడచి పోవుచున్నది.

ఆదికవినన్నయ ప్రారంభించిన 'సంప్రదాయకవిత' క్రమక్రమముగా కవి సంస్కారమును బట్టి వివిధపద్ధతులలో పయనించుచునే యున్నది. ఇతి వృత్తమునెన్ను కొనుటలోను, జాతులు వృత్తములను వాడుటలోను కవికి ప్రత్యేక మగుస్వేచ్ఛ యున్నది. దానిని స్వేచ్ఛయనుటకన్న 'అభినిరతి' 'సహ జాతమ'ని యనుట తగును.

సమాజమున ననుసరించి భాష-సాహిత్యము నెప్పటి కప్పుడు ఎదుగుచు రంగు హొరంగులను సంతరించుకొను చుండుట గమనించగలము. ఏ ఛందస్సున వ్రాసినను అది సహృదయునాకట్టుకోగల్గినదై - యుత్తమ రసానుభూతి నీయగలదే 'మంచికవిత' యనదగును.

నిన్న మొన్నటి తెలుగు భావకవితా వీథులలో వీర విహారముచేసిన కవి తల్లజుల గీతాలాపములు తఱచుగా వినవచ్చుచునే యున్నవి. అవి భావ ప్రవాహ ప్రధానములు, రసమంజులములు, నూతనోత్తేజస్కరములు; ఈ షద్వ్యలక్షణలక్షితములు.

అటువంటి మధురభావవనీనికుంజముల నుండి తరలి వచ్చినప్రవాహమే శబరి. గోదావరికి శబరి యుపనది. అటులనే గౌతమీ కావ్య గౌతమికి కావ్యసుందరి సహజన్మురాలై మనో నేత్రములకు తారసిల్లుట మఱియొక అపూర్వ సంఘటన॥

'ఆదికవిరాజు' వాల్మీకి రామాయణమున అరణ్య కాండలోని 75వ సర్గమున 'శబరీ సపర్యా' ఘట్టమున నీవిశేషణముల నుపయోగించినాడు.

"కచ్చిత్తే నిర్జితా విఘ్నాః కచ్చిత్తే వర్ధతేతపః కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనసస్సుఖమ్ కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణీ।"

"ప్రాపంచికమగు నాటంకముల నెదిరించి మనస్సున నిరంతర తపస్సును నిల్పుకొన్నదై ఆహారమును అదుపులోనుంచు కొనినదై నిజ

మైన మానసిక సుఖమును పొందునది, గురు శుశ్రూషాతత్పరురాలు. కృతార్థురాలు। మృదుమధురముగా మాట్లాడగలది, శబరి అని భావము. శబరి వృత్తాంతము చిన్నదయ్యును - జీవితసాఫల్యమును సాధించిన దగుట మిన్నయైనది. ఆ తపస్విని భావములు-వృద్ధాప్యము - అంతిమనిరీక్షణములు-ఉత్తమగతికి స్వర్గతికి స్వర్ణసోపానములు॥

శః చిన్నారికావ్యము ఆకర్షణీయమగు ప్రతీక్షతోనే మొదలగును. ముసలిముద్దయై తెప్పలు వ్రాలిపోయిన స్థితిలో శ్రీరామ సందర్శనకై కన్నులుగాయలు కాచినటు చూచుచున్నది. ఆయన యెపుడు వచ్చునో!. ఇన్నాళ్లనుండి పడిన తపన వ్యర్థమగునా? తను వంతరించిన నేమిలాభము? ఊపిరుండగనే స్వామిని కలసికొన వలెనను నుత్తాంతను శబరియొక తెరువరి నుద్దేశించి చెప్పిన తీరు మనోజ్ఞము.

"ఈవు వచ్చిన దారిలో ఇంద్రనీల
మణిగణాభ దేహుడొకడు, మహితహేమ
కాంతి రేఖా మనోహరగాత్రుడొకడు,
గానిపించిరే॥ నీ కనుల్ కలవుదీర. ప్రతీక్ష 2

"భానుకులుడు నీకోసము వచ్చుదనుక
నీ శిథిలదేహయష్టిని నిలిపికొనుము.
శక్తికిని రక్తికిని, భక్తిముక్తులకును
కాయమేకదా॥ యుపయోగ కారకమ్ము" ప్రతీక్ష-14

"అమృతముల నీను తీయ తీయని ఫలాలు
మంచివలపు విదులు సంతరించినాను,
చక్కగా చవిజూచి వాసనలు చూచి,
శ్రీరఘూద్వహు కైంకర్య సేవనలకు" ప్రతీక్ష-18

ఈ చిన్నారి పద్ధియములు గమనమున భావమున సమ్మతవించుపులు. శబరి పాంథునకీ యుదంతము చెప్పి రాముడు వచ్చు చున్నా డని భావించియే యలజడియైనను ఆ స్వామియడుగుల చప్పుడేయను కొనును॥ వయసున పెద్దదయ్యును సుమధుర భక్తిభావమున నెంత ముద్దరాలు॥

''ఉండుముండుము వినవచ్చుచుండె, నెవరి
యడుగు సవ్వడియో, కాదు-యాశ్రమ మద
కరుల. వటభూరుహచ్ఛాయ కరుగుచుండె.
సూర్యు డస్తాద్రికిన్ జేరుచుండనోపు'' ప్రతీక్ష-10

పతితలకు క్రౌంచపర్వతము - నిబిడారణ్యము - మఱ్ఱి చెట్లనీడలకు పోవు మదగజములు-సాయంసమయము-సూర్యాస్తమయము ఇన్ని పనీ దృశ్యములు స్ఫురించు చున్నవి. ఎంత చక్కని భావన॥.
తెలుగునుడులతో చిక్కని శైలిలో ప్రకృతి రామణీయకమువర్ణించు పద్ధతికివి మచ్చుతునకలు॥

ఋతువులన్నియు నామనులే, పికీగ
శ్రవణ్మధు రాంచితలలిత గీతి
కాముఖరితమ్ములే, మధుకర సముత్క-
రోదితామేయఝుంకృతీ నాదగతులె" ప్రతీక్ష-11

'విరహి'లో
"అస్తమిత భాస్కరుని యరుణారుణాంశు
వొకటి. జాల్వాటి రఘురాము చికిలినీలి
చెక్కిలింబడి, కన్నీటి చుక్కలోన
ప్రతిఫలించెను సప్త వర్ణముల కాంతి'' విరహి-3

సూర్యుడ_స్తమించు చున్నాడు, ఎఱ్ఱని కిరణమొకటి చెట్టుక్రింద విశ్రమించిన రాముని అందమగు నల్లని బుగ్గపై పడెనట॥ అంతకు పూర్వమే సీతా వియోగఖేదబాష్పబిందువు-ఆ అరుణకాంతి చేత సప్త వర్ణముల యింద్రధనుస్సువలె నున్నదట॥ ఈ కల్పన అనల్పమైనది. ఇంతలో ఒక లేడి కూన చెంగు చెంగున దాటులు వేయుచు దవ్వునకు పోయెనట॥ అదృశ్యము - సీతా పహరణగాథను-స్ఫురింప జేసినదట। దానికితోడు,

చిలుక, గోరువంక, చక్రవాకముల జంటలు కువకువలాడుచు కంట బడినవి, ఇక చెప్పవలసినదేమి; ఆయన మనోవేదన - విరహోత్కంఠ,

"రాముని యెదలోన భావము లేమి యేమి
తొలకరించి రాగిల్లెనో తెలియరాదు" విరహి-10

విరహులకే తక్క అన్యులకాబాధ తెలియరాదు గదా॥
పూర్వకావ్యములలో 'చంద్రోపాలంభనము' కనిపించును. కాని యిచట కవిగారు తననేర్పుచే క్రొత్త పద్ధతిలో చమత్కరించినారు.

చంద్రుడవునీవు సూర్యవంశజుడనేను
లేశమేని వైషమ్యము లేదు మనకు. విరహి 20

"ఈ విరహావస్థలో నన్ను బాధింపకుము. చల్లదనము వహించుటకు నీపేరును నాపేరున చేర్చుకొంటివి, నిజమునకు సూర్యచంద్రులు విష్ణుని నేత్రాలు గదా"

''కాని పింపవా నీవు, నా కనులు కఱవు
దీరగా కానిపింపవా - దెసలు దెసలు
పల్లవింప నటించు శంపాకుమారి
పోలెనైన గాన్పింపవా - విరహి-26

సీతారాముల దాంపత్యము లోకోత్తరమైనది. వారి ప్రేమానురాగములు ఉత్కృష్టములు. సీతా! కడకు శంపాకుమారి వలెనైనను ఒకసారి కనిపించవా అనిన సందర్భమున 'శంపాకుమారి' అనుటకు మారు పంపా కుమారి, అను విషయము స్ఫురణకు వచ్చుచున్నది. శబర్యాశ్రమము పంపా సరోవర పశ్చిమ తీరమున గలదుగదా!

ఈ కావ్యమున గల స్మృతియనునది కవి భావనా బలమునకు నిదర్శనము. శబరి సమగ్ర చరిత్ర తెలియరాదు. మతంగర్షి ఆశ్రయము-తదాశ్రమ నివాసము - గురువియోగము-రామసందర్శనాకాంక్ష-అను గత చరిత్రను శబరి-కాసార తీరమున జ్ఞప్తికి తెచ్చుకొన్నది.

ఒకనాడు ప్రభాతమున ఆశ్రమమును శుభ్రపరచి - రంగవల్లికలను దిద్దుటను చూచి మతంగముని యెవ్వరి వీవని ప్రశ్నించును. అప్పుడు శబరి కరుణారసము చిప్పినట్లు.

నన్నుగన్న నా నామమ్ము విన్న జనులు
తరిమి తరిమి కొట్టుదురయ్య తాపసేంద్ర! స్మృతి 17

నిర్మలానందుడు శబరికి మంచిమాటలు చెప్పినాడు, నిజమైన మనిషిని చేసినాడు. ఆమె హృదయమున గురువై నిలిచినాడు. వారిస్నేహమును మాయా దూరులైన మునులు సైతము అనుమానించిరి. ఆయువ వాదున కతడు అస్తమించినాడు. నరహంతకులు గల తన జాతినిబాగు చేయదలచినది శబరి. సాధ్యముకాలేదు. ఆసటబాసటగా నుండు నిర్మలానందుడు దూరమైనాడు. వికలహృదయయైన శబరి పిమ్మట గురుని దయ వలన రామలక్ష్మణులకు తియ్యని పండ్లను బెట్టి జన్మసాఫల్యము నంది కొన్నది. నిషాద స్త్రీకి ఆశ్రమ ప్రవేశము కల్పించిన మతంగుని సైతమా నాటి మునిగణము శంకించిన దందురు.

ఈ సన్నివేశ కల్పనలో రచయిత జీవితానుభవము ధ్వనించుచున్నది. మంచివారిని గుర్తింపలేని మూర్ఖసమాజములో బ్రతుకుట అజ్ఞానము. సంఘమును సంస్కరింప వలెనను కొనుటయేకాని అది అంతలో సంస్కరింపబడునా। ఈ విధమగు సంక్షోభము లేవియో హృదయమున చెలరేగి యుండును. ఆప్తులు లేక పోవుట-ఏకాకియగుట-ముసలితనమువచ్చుట-ద్రోహబుద్ధులు - ఇవియన్నియు నిస్పృహాయ పరిస్థితులే కదా: కవిగారి మనస్తత్త్వము శబరి మనస్తత్త్వము ననుసరించు చున్నట్లు ఊహింప వచ్చును. నిర్మలానందుడు కవి కల్పిత పాత్రయే.॥

"నిర్మలానంద శబరుల స్నేహగరిమ
లౌకిక విహారులు మునితల్లజులు సహిత
మన్యథా యెంచి, నిర్దయులగుచు, వాని
జీవ కావ్యమునకు స్వస్తి చెప్పినారు'' స్మృతి24
'ఆతని సమాధి సన్నిధికను దినమ్ము' స్మృతి 25

కవిగారి గడుసుతనము-సన్నివేశ సంఘటనలు - అపూర్వములు. ఇంత వఱకు శబరి ఊహించినదంతయు స్వప్నమేనట। మతంగగురు శుశ్రూష నిజము॥ నిర్మలానందశబరులు, అనుటలో విలక్షణత కలదుగదా॥

వీరి కవితా పరిణతికి పాండిత్యమునకు
'అంబు జాత పత్రచ్ఛాయ హంసయొకటి
పరమ హంసక్రియ కుముదాంతరమునందు
ఆసనస్థుడై కూర్చుండె ధ్యాననిష్ఠ
అచటి మునిజన సాహచర్యమ్ము కతన" స్వాగతి-3
"ఆ శబరి పునీతాశ్రమ ప్రాంగణమున
నలరు నవచూతశాఖి శాఖాంతరముల
కీరశారికల్ రామసంకీర్తనమ్ము
సలుపసాగెను తీయని పలుకుతోడ" స్వాగతి-7

శ్రీరామనామకీర్తన శ్రవణలగ్న చిత్తయైన శబరి కనులెత్తి చూచునంతలో 'రామలక్ష్మణులు' కనిపించిరి. అంత శబరి భావన.

'వచ్చివేసెను నాస్వామి వచ్చివేసె ' స్వాగతి 11
''రండు శబరిపూరింటికిరండు ఎన్ని
నాళ్ళకెన్నినాళ్ళకు వచ్చినారు మీరు'' స్వాగతి 19

'పరివస్య' లోని పద్యములు చాల వఱకు బాలకాండములోని శ్రీరామ మహిమాభి వర్ణనములే॥

"నల్లరాతిని నవజీవమ్ము, పులక
రింప సుమనోమనోహరాకృతిని, తీర్చి
దిద్ది, ఇలు నిలబెట్టిన దివ్యపదము
లంటి పూజించి నే ధన్యురాలనైతి.' వరివస్య 6

శబరి 'రామా। యివి సీతాఫలములివి' అనగా రాముడు పత్నినామ శ్రవణమున కంటనీరు బెట్టెను. శబరి రాముని కన్నీటి కనులునొత్తెను.
ఎంగిలి పండ్లని తెలిసి శ్రీరాముడు

అమ్మయొసగెడు కాలకూటమ్మునేని
స్వీకరింపక పసిబిడ్డ విడచునేమి. ఉచ్ఛిష్టము 7
ఈవునేనను భేదమొకింతలేక
ఆత్మవత్సర్వభూతాని యనెడు సూక్తి
జీవితమ్మున కాదర్శమై వెలుంగ
ప్రతి హృదిని మానవత చెలువారవలయు.

అను వేదాంతవాణి-రామునిచే చెప్పించి కవి అద్వైతసిద్ధిప్రతిపాదించినారు. శబరి సీతమ్మ మహా పతివ్రత అపహరించిన రావణుడు నీవలన నంతరించును. అని చెప్పి వారి సన్నిధిని యోగాగ్నిలో భస్మీభూతురాలయ్యెను.

రాముడధివసించిన పూలగద్దె - ఒక గొప్ప పర్వతమై అందుండి శబరీ స్రవంతి పాఱజొచ్చినది.

తెలుగుమాగాణమెల్ల విస్తృతముకాగ
పసిడి పచ్చనిపైరులు పండి, దేశ
మెల్ల నిత్యసుభిక్షమై యుల్లసిల్ల
వృద్ధగౌతమి లోన విలీనమాయె. మహాస్సు 19

ఇక్కడ శబరి పుట్టువునకు సార్ధకత కల్గినది, ఆమె తెల్లువారి అడవడుచు అయినది. కావ్యాంతమున రామునినోట

'భక్తునకు బ్రహ్మకు నవినాభావబంధ
మేగదా ! అట్టిచో కులమేడ ? జాతి
యేడ, మతమేడ, ఎంగిలికేడతావు'
సాత్త్వికప్రేమలో నన్నిసమసిపోవు ఉచ్ఛిష్టము 10

వనికించి కావ్యజగత్తు ఉపనిషద్వాణిని కవిగారు ధ్వనింపజేసినారు.

శబరి తెలుగుమాగాణమున పెరిగి పెద్దదైనఅద్భుతకావ్య భారతి. సహదేవ వారి సాహితీ తపో లోకమున విరిసిన కావ్యరాజమిది. ఒక కవి వలన చిన్నదయ్యు కిన్నెరసాని తెలుగునాట సుప్రసిద్ధురాలయినది. అంతకన్న పవిత్ర చరిత్ర - భక్తి సేవా భావములు - లలితకావ్యశిల్పశ్రీ గల శబరి నాంధ్రులు మఱింతగారవింతురని యాశింపవలసి యున్నది.

కావ్యాంతమున నొకపరి సింహావలోకనము గావించినపుడు పతిత - జీవిత కావ్యమున శబరి పండిపోయినట్లే శ్రీ పన్నికాశరావుగారు భక్తికావ్య జీవితముల పరిపక్వత నార్జించిన కవిధన్యులనిపించును.

---

శ్రీ చిన్మయ బ్రహ్మకవిదరి కావ్యాలు :- సంధ్యా గౌతమి, శివరంజని, విశ్వదాభిరామము, రామానందము, త్రివేణి, కవిబ్రహ్మ, నాదబ్రహ్మ ఇత్యాదులు.

# అభినందనము

శ్రీ కరుటూరి సత్యనారాయణ, బి. ఏ;
రిటైర్డు అసిస్టెంటు కమీషనర్, (C. T.)

"అతడనేక యుద్ధములనారియుతేఱిన వృద్ధమూర్తి" అన్నట్లు శ్రీ సహదేవ సూర్యప్రకాశరావు సప్తతి వర్షములు గడచిన వయోవృద్ధులయ్యు యువత హృదయముతో సాహితీవేత్తలుగా వివిధ ప్రక్రియలలో రచన సాగించుచు లబ్ధప్రతిష్ఠులైన సుకృతాత్ములు. తమ ఏబది సంవత్సరముల సాహిత్య జీవితములో కావ్యములు, నాటికలు, గేయములు వ్యాసములు, విమర్శలు పుంఖాను పుంఖములుగా గ్రంథియించి ఆంధ్రలోకమున కందించిన మహోదయులు. సాహిత్య ప్రక్రియలలోనసమానమైదుప్తి గరిమ వెలయించిన పరమ భావుక పట్టభద్రులు. కరుణాస్విన్న హృదయముతో సమాజములో నశాంతిని కలుగచేయు ప్రతి చిన్నవిషయమునకు స్పందించి నవమార్గ వైతాళికులుగా పురోగించుచున్న సరస్వతీ పురోధసులు. వారు కవిసత్తములు. రూపకళామర్మజ్ఞులు. విపశ్చితులు సున్నితము సునిశితమగు దృష్టి కలవారు భావనాపటిమకలవారు, పూర్వప్రబంధముల నన్నిటిని పుక్కిటబట్టుకొని భాషతో వరివస్య చేయించుకొనుచు నిరంతరాయముగా భావ గాంభీర్యముతో రచనలు సాగించుచున్న మహాత్ములు. అద్యతనార్వాచీన కవిత్వ రచనలో మీనుమిగిలిన పాండితీ ప్రకర్షలు వెలయించుచున్న రస హృదయులు. సంఘజీవితమున కాటంకము కలిగించుచున్న సమస్యల నర్థముచేసికొని తమకు తోచిన పరిష్కృతిని సూచించుచు సంఘజీవితమున కుపకరించుచున్నవారు. సంస్కరణాభిలాషులు. తమ పరిష్కృతి గేయ కావ్యమును ముత్యాల సరములతో నిగదించి వరకట్న సమస్యకు ప్రాముఖ్యము నొసగి స్త్రీ జనోద్ధరణకు మార్గములను సూచించినారు. సంఘ

సంస్కర్తయగు కందుకూరి వీరేశలింగకవి నాదర్శ పురుషునిగా తీసికొని వారి సర్వకృతులను ఆకళింపు జేసికొని,వారిసంస్కరణోద్యమమును శిరోధార్యముగా స్వీకరించి, ప్రగతి పథములో పయనించుచు రసాధ్వ ఋయాసుస్థలను తనియించుచు కృతులు నుడువుచున్న సహృదయ రచయితలు. వీరేశలింగకవి వీరి యారాధ్య దైవము. ఆ గౌరవాభిమానములగా "శ్రీ కందుకూరి వీరేశలింగ కవీంద్రుల నాటకాల ప్రహసనాల పరిశీలనము"ను సుద్గ్రంథమును రచించినారు.

వీరేశలింగంగారియెడల వీరికి ప్రగాఢమైన అభిమానము. వారు నడపిన వికాసోద్యమములో నమ్మకము విశేషము. కాన ఆ పరిశీలనములో, నవ్యతనుంది. సమగ్రతవుంది.

తొలుత వీరు భావకవిత్వముతో నాకృష్టులై "మునిమాపు" 'వకుళమాల" కావ్యములను రచించి పండిత పామరుల మన్ననలందు కొన్నారు. వీరికి నాటకములనిన ఎనలేని అభిమానము. పలుతావుల జరిగిన నాటికల పోటీలలో వీరు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించియున్నారు. మంచి విమర్శకులు. "రూపకళ" అను నాటక శాస్త్రాన్ని ఉల్లేఖించినారు.

ప్రస్తుతకావ్యము శబరి. కవిగారు శబరికావ్యమును ప్రతీక్ష, విరహి, స్మృతి స్వాగతి, వరివస్య, ఆతిథేయము, మహస్సు, ఉచ్ఛిష్టము అను అష్ట శీర్షికలలో నిగదించి యున్నారు.

శ్రీ సూర్యప్రకాశరావుగారు తమ భావనాబలముతో ఊహాపోహలతో సముచితమగు మార్పులతో 'శబరి' కావ్యమును మనోహరముగా గ్రథియించిరి. వాల్మీకి రామాయణములో శబరియొక నిషాదనాయకుని తనయ. అమాయిక. కాని వీరి శబరి

'అన్నెమును, పున్నెమెఱుగని యాత్రజనుల
ధనము, మానము, ప్రాణవితానమెల్ల
అదయ హృదయాన కొల్లగొన్నట్టి అటవి
జాతికేకైక నాయిక' స్మృతి 18

శబరిని పాపకార్యములుచేసి పశ్చాత్తప్త హృదయగా మార్పు చేయుటలో కథకొక ఔన్నత్యమును, గాంభీర్యమును సంతరింపజేసి నాయిక యెడ సానుభూతి కలిగించిరి.

వాల్మీకిరామాయణములో నిర్మలానందుని ప్రసక్తిలేదు. ఈ పాత్ర కవి గారి కల్పన. శబరీ మతంగుల సాన్నిహిత్యమును రామాయణములో శిష్యులే యపార్థమును జేసికొని యవహేళనముచేయగా మునీంద్రుడామె మనః స్థైర్యమునకు మెచ్చి, యామెను తన శిష్యురాలిగా స్వీకరించెను. కాని వీరి శబరి కావ్యములో

"నిర్మలానంద శబరుల స్నేహగరిమ,
లౌకిక విహారులు మునితల్లజులు సహిత
మన్యథాయెంచి నిర్దయులగుదు, వాని
జీవకావ్యమునకు స్వస్తి చెప్పినారు" స్మృతి 23

మతంగ మహర్షి శీలమును శంకించుట సహజముగా నుండదని భావించి కవిగారీ మార్పుచేసి నిర్మలానందుని పాత్రను సృష్టించినట్లు కనబడుతుంది. శబరి రామలక్ష్మణులకు ఆతిథ్యమొసగుచు ఎంగిలిఫలము లిచ్చిన విషయము వాల్మీకిరామాయణములోలేదు. కాని యీ విషయము జనశ్రుతిలోను, కొన్ని యితర రామాయణములలోను నున్నది. శబరి రామునితో యిలా అంటుంది.

'వనము నలదలి చెట్టు చెట్టునకు తిరిగి
తిరిగి, మిగులమాగినపండ్లు, తేనెలీను
పండ్లు, చవిచూచి కోసుకవచ్చినాను
కోరి, శ్రీరామచంద్ర! నీకోసమేను. అతిథేయము 2

దానితో లక్ష్మణునకెంతో కోపము వచ్చింది.

తానుకొటికి తిన్నఫలాలతోనె, అతి
థేయ సత్కారమొనరించు బోయ ముగుద
నుగ్రదృష్టులగాంచి, చేయునదిలేక
బుస్సుమని లక్ష్మణుండూర్పు బుచ్చినాడు. అతిథేయము 4

లక్ష్మణుడు ఆదిశేషుని అవతారముకదా! బుస్సుమనుటలో ఆశ్చర్యములేదు. విరహి శీర్షికలో లక్ష్మణుడు ఒక వటవృక్షమూలము చేరి వదినె తన్ను గూర్చి పలికిన పరుష భాషణములను తలపోసికొనుచు కూర్చుండెను. అప్పుడు

చిమ్మటలపొద పొదరిండ్ల జీబుకొనియె,
ప్రాకికొనివచ్చి జరజర త్రాచుజంట,
తిరిగి సౌమిత్రి చుట్టు, వెన్దిరిగి పోయె,
బుస్సుమని లక్ష్మణుండూర్పు బుచ్చినాడు. విరహి 14

ఈ వర్ణనకూడ లక్ష్మణుని శేషావతారమును గుర్తుతెచ్చునదే.
శబరి రామునకాతిథ్యము నొసగుచు సీతాదేవి ప్రసక్తి తెచ్చినది.

ఎవడో సీతాసతిని ముచ్చిలించియోమె- పరివస్య 11

అమ్మసీతమ్మతో కూడి యరుగుదెంచి- పరివస్య 12

శబరి స్త్రీ యగుటవలన స్వాభావికముగా శబరి సీతాప్రసక్తి తెచ్చినది. ఇది

హిందూకుటుంబములలో యింటికి వచ్చిన అతిధులను స్త్రీలను గురించి ప్రశ్నించుట పరిపాటి. ఇచ్చట శబరి ఆశ్రమ గౌరవమును నిలిపినది. శ్రీరాముడును దానికి తగినట్లుగ

నన్నుగూడి వైదేహికి, నిన్నుజూచు
దివ్యభాగధేయమ్ము రవంతలేదు,
నిన్నుబోలు మహామహిమోన్నతులను
గాంచు భాగ్యమెల్లరకును కలుగునొక్కొ. వరివస్య 20

అని శబరినోదార్చును. రాముడు అతిధిగావచ్చెనుకదా। తాను ఉన్నత స్థానములో నుండియు భక్తురాలగు శబరికి నమ్రముగా సమాధానమిచ్చినాడు. రాముడెప్పుడును స్మితపూర్వాభి భాషికదా। తనకష్టమును తనలోనే దాచుకొని ఎదుటివారిని తృప్తిపరచు స్వభావము రామునిది. శబరి బోయకులజ, మరియునుస్త్రీ.

రాముడు మతంగాశ్రమమునకు వచ్చి శబరికి దర్శనమిస్తాడు శబరి యిలా రామచంద్రునితో అంటుంది.

కన్నతండ్రివినాకు - నా కన్నమాట
యేమి యీరేడులోకాలకీవు తండ్రివి. వరివస్య 18
ఈవుకరుణా రసాంచిత హృదివి హీన
దీన మూర్తుల పాలిటి దిక్కుపీవ.
ఎంతొ వాత్సల్య గరిమ త్రుళ్లింతలాడ
నన్నుజూడనడచి వచ్చినావు రామ. వరివస్య 19

"ననుపాలింప నడచివచ్చితివా" అను త్యాగరాజకృతి స్ఫురణకు వస్తుంది. అప్పుడు రాముడు శబరిపై ప్రీతితో యిలా సమాధానమిస్తాడు.

నవవిధమ్ముల భక్తి గణమ్మునందు
భక్తిసరణియే మోక్షసోపాన పధము. వరివస్య 23

వేదవిద్యావిదులకన్న నాదుహృదయ
వరులు, స్వార్థమేలేని సద్భక్తవరులు. పరివస్య 24

శ్రీ సూర్యప్రకాశరావుగారు శబరి ప్రతీక్షతో మనోహరముగా కావ్య ప్రారంభము చేస్తూ రామలక్ష్మణులను వర్ణిస్తారు. శబరి తెరువరితో యిలా భాషిస్తుంది.

ఈవు వచ్చినదారిలో, ఇంద్రనీల
మణిగణాభదేహుఁడొకఁడు, మహితహేమ
కాంతిరేఖా మనోహర గాత్రుఁడొకఁడు,
గానిపించిరే నీకనుల్ కఱవు దీర. ప్రతీక్ష 2

నిశితబాణప్రపూర్ణ తూణీరములును,
దందశూకముల్ బోలు కోదండములును,
నారచీరలుదాల్చి యొప్పారుచుంద్రు,
వారుసుకుమారవీరకుమారులయ్య. ప్రతీక్ష 3

రామలక్ష్మణుల వర్ణన మనోజ్ఞంగావుంది.
మతంగమహర్షిని శబరి వర్ణిస్తూ తెరువరితో చెప్పుతుంది.

శ్రీమతంగ మహర్షి మహా మహస్సు
కల తపస్వి, మనస్వి, దిగంతరాజి
తామలయశస్వి, తేజస్వి, అతడెనాకు
సదుపదేశమొసంగిన సద్గురుండు.

శ్రీరాముని విరహ వేదన నద్భుతముగా వర్ణించియున్నారు. అవి విరహి శీర్షికలో 25 నుండి 31 పద్యములవఱకు ఉన్నవి. మతంగుని మహిమలను ఆశ్రమమును వర్ణించు పద్యములు హృద్యానవద్యములుగా నాటకీయముగా నున్నవి.

మతంగమహర్షి శబరి వృత్తాంతమును గురించి ప్రశ్నించినప్పుడు మనో వేదనతో శబరి సమాధానము

చేసిన యఘసంఘాతము మాసిపోవ
చేయుచుంటిని మీ పదసేవ స్వామి! స్మృతి 18

శబరి తన గతజీవితమునకు పశ్చాత్తాప పడుచు మతంగమహర్షితో పలికిన పలుకులు కరుణ రసభరితములుగా నున్నవి.

ఎడనెడ వర్ణించిన వర్ణనలు హృదయంగమముగా నున్నవి.

ముత్తెములు పవడాల్కాల బోసినటుల
చెందొవలు, తెలిదమ్ములు చెలువుమీఱె. స్వాగతి 1
తెలుగుమగనాలి సిందూర తిలకమటుల
వెలుగులీనె తూర్పుముఖాన వేగుచుక్క. స్వాగతి 2

పరివస్య, అతిధేయము శీర్షికలు సుమనోమనోహరముగా తీర్చిదిద్దబడినవి.

రామచంద్రునితో శబరి యిలా భాషిస్తుంది.

నీలినింగిని జూచి, నీలాల జలద
పాళికలజూచి, నీలికల్వలను జూచి
నీవనెడి భ్రాంతి దినము లెన్నెన్ని గడపి
నానొ, ఎఱుక నాకిసుమంతయేనిలేదు. పరివస్య 10

శబరి తాను రామశుభాగమనమునకు నిత్యప్రతీక్షలతో నెట్లు వేగిపోయినదో వివరించింది. సీతాపహరణమునకు చింతించినది. తన్ను జూడ నడచి వచ్చితివని సంతోషించినది. చివరకు శబరి రామచంద్రునియనుమతితో జ్వలితయోగాగ్నిలో భస్మీకృత దేహయైన తదుపరి కవిగారి శబరి కావ్యములో కొన్ని క్రొంగ్రొత్త విషయములను నిగదించి కావ్యమును పరమ రమణీయముగా సమాప్తము జేసినారు.

ఎండవేసిన వలువలదృశ్యమాయె, మహాస్స 14
మౌని పర్ణకుటిక మటుమాయమయ్యె. మహాస్స 15
ఆగిరియె రామగిరిగ విఖ్యాతినంది,
శప్తుడై ప్రియావిరహ సంతప్తుడైన,
ఒక్క యక్షునకు నివాసయోగ్యమాయె.
ఆస్రవించునదియె శబరీ స్రవంతి. మహాస్స 16
తెలుగు మాగాణమెల్ల విస్తృతముగాగ
పసిడి పచ్చని పైరులుపండి, దేశ
మెల్ల నిత్యసుభిక్షమై యుల్లసిల్ల,
వృద్ధగౌతమి లోన విలీన మాయె. మహాస్స 18

కవిగారి ఊహలు రసరమ్యములు. శ్లాఘాపాత్రములు. సమంజసములు. మంజులములు. భావకవిత్వపు ఛాయలు కావ్యమునిండా రసస్ఫోరకములుగా, నిసర్గ సుందరముగా పాఠక హృదయములను తనియించుచున్నవి. సూర్యప్రకాశరావుగారి శైలి సరళము. శక్తిమంతము, భావగంభీరము, ధారాశుద్ధిశోభితము. ఆధునికము, నిర్దుష్టము. పద్యములు హృద్యానవద్యములు. కథలోని మార్పులు సముచితములు. పాత్రచిత్రణమమోఘము. ఊహ, కల్పన మనోజ్ఞముగా చేయగల దిట్టలు. కవిగారు నిగదించినతీరు సురుచిరము. ఔచితీసహము. కవిగారికి నా అభినందనలు.

రాజమండ్రి
9-5-86

---

శ్రీ కరుటూరివారి కావ్యాలు :

తిష్యరక్షిత, కరుణాసౌగతము, ఆమ్రపాలి, సత్యదర్శనము, ఆశ్రమ సందర్శనము, పంచవటి, మైత్రీ బంధము, రసమంజరి.

# రెండు మాటలు

నానృషిః కురుతే కావ్యమ్.

వాల్మీకి ఋషి. కవి, కవికోకిల, కోకిల కాకలీకలనిక్వ ఆకవీశానునికవితాకాంతకాలియందియలఘలం ఘలలు కమనీ కమబంతాల కలయ ప్రాకి భరత ఖండవాసులనే గాక ఖండ ఖండ వాసుల్నికూడాఅలరించి పులకింపచేసినవి.

వాల్మీకి కృతరామాయణం విశ్వసాహిత్యానికి నాంది. అమర యోషామణికి తొలి యనర్ఘ శిరోభూషణం. సుషమామనోహరవ శ్రీమద్రామాయణం మహత్తర మయింది. రసవత్తర మయింది.

అందులో వివిధ మనస్తత్వాలు గల మానవ దానవ పాత్రలే గాక పక్ష్యాదులు సహితం ఉండి పరితలకుఏదోఒక ధర్మాన్ని, ఒక సందే అభివ్యక్తం చేస్తవి. ఆ పాత్రలు కవికల్పితాలే అయినా స కాలచక్ర పరిభ్రమణంలో అవిచరిత్రపాత్రలై మానవ జీవిత యాత్రాపథంలో పదే పదే ప్రతి బింబిస్తుంటవి. పల్కరిస్తుంటవి. అ జవం, లివం, జీవంతో వాల్మీకి కథా కథనంతో. పాటుతన పా తీర్చిదిద్దాడు.

అపహృత సీతను అన్వేషించు కొంటూ అడుగడుగున వేదనా హృదయ ఆశ్రమానికి అరుదెంచిన శ్రీరామలక్ష్మణులకు ఆతిథ్యమిస్తుంది శబరి, ఆతిథ్యమే ప్రస్తుత కావ్యేతివృత్తం. శబరి శ్రీమతంగ మహర్షి రాలు. ఆ మహర్షికి నిత్యం శుశ్రూష చేసి తల పండించు కొన్న జీవికను పండించు కొన్నది. అంతటి వృద్ధాప్యంలో అభీషణారణ్య ఏకాకిగా ఏకాంత రామయ్య కోసం ఎదురు తెన్నులు చూస్తున్నది శ ఎట్టకేలకు శ్రీరామచంద్రుడు శబరి ఆశ్రమానికి విచ్చేశాడు. ఆ

కావ్యకర్త



విద్వాన్. సహదేవ సూర్యప్రకాశరావు.

ఉపాధ్యక్షులు : హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అధ్యక్షులు : వీరేశలింగోన్నత పాఠశాల.

గౌరవసభ్యులు : ఆంధ్ర నాటక కళాపరిషత్. విజయవాడ.

మేఘశ్యాముణ్ణి చూచిశబరి హృదయం పులక రించింది. ఆమె ఆనందానికి అవలిసీమలేదు. నెమ్మదిగా తేరికొని వారికి అర్ఘ్య పాద్యాదులిచ్చి అంజలి ఘటించి ఇలా అన్నది. "ఘనతమ్ముడు నీవు నీయెడన్ జేరగ వత్తరు! మిముజూచి సంతటనే ఒదవెడు ఉత్తమ లోకములంచు (మద్గురూత్తముడు) జెప్ప సమ్మద మెదగ్రమ్మన్"-

"నీకొఱకు మంచివి మంచివి ఏరి కోరి పెక్కు తెగల పన్యసంతతులు గూరిచి యుంచిన దాన రామ"
(వావిలి కొలను వారి రామాయణములో అ॥ కాం॥ ప॥ 1262)
అని క్లాంతరవమున బలికి శ్రీరామునికి పక్వ ఫలాలతో సాతిధ్య మిచ్చింది. కాని ఎంగిలిపండ్లతో నాతిధ్యమీయలేదు - ఎంగిలిపండ్లతో నాతిధ్యమిచ్చినట్లు వాల్మీకి రామాయణంలోనే కాదు। ఇతర రామాయణ ములలో కూడా ఉటంకించి యుండలేదు. ఒక్క యోగానంద రామాయణం మాత్రం ఇలా వాకొన్నది. "చవిచూచి ఏర్చి పేర్చి కూర్చిన బత్తిని దద్యోగినీ మణి తనకు సమర్పనా పూర్వకముగా సమర్పించుట ఎఱిగియు పతంగకులపుంగవుండెంగిలి పండ్లని యొండాడక కొండాడి యామెంగూడి భుజియించె"
అలా గ్రంధించిన శ్రీ యోగానంద కవికి అసాక్కారమేమి?

అకవియే ఎంగిలి పండ్లు తిన్నరామునితో "భక్తజనమ్ముల దనుపుటయ మదీయ కార్యమని లోకమ్మున కెఱిగించి" అని పలికించి సమర్ధించు కొన్నారు. శబరి చవిచూచిన ఎంగిలి పండ్లతోనే శ్రీరామచంద్రుని కారగింపు పెట్టినట్లు జనశ్రుతి. ఆ జనశ్రుతి కాధారమేమి? రామా యణ కావ్యాలలోలేని యాఘటన జనతామనస్సులో ఎలా పాదు కొన్నది. పాదుకొనడమే గాకుండా ఆ భావం అస్థిగతమయి పోయింది. భక్త రాజయిన త్యాగరాజస్వామి తన కృతిలో "ఎంతని

వర్ణింతు శబరీ భాగ్యము" అని గొంతెత్తి శబరీ భాగ్యాన్ని అలా ప్రపించి ఆమె చేత శ్రీరామునకు ఎంగిలి పండ్లతో ఆతిధ్యమిప్పించాడు. "అప్పా! రామ భక్తి ఎంతోగొప్పదిరా" అనే కృతిలో "శబరి ఎంగిలినిచ్చునా చంద్రధరుడు మెచ్చునా'' అని-"పరాకు నీకేలరామా" అన్నకృతిలో "పురాణ శబరి యొసంగిన యటులే భుజించుకొన్న శేషమూరామా'' అని గానం చేస్తూ, తన్మయత్వంతో తాండవిస్తూ జనానీకంలో ఉన్నాభావానికి జీవం పోశాడు.

కొన్ని కొన్ని విషయాలు వాస్తవాలు కానివి గ్రంధాలలో కానరానివి, ఎలాప్రాదుర్భావం పొందుతవో గాని, చిత్రాతి చిత్రంగా ప్రజాహృదయాల్లో పాదుకొని కాలక్రమంలో సత్య విషయాలై భాసిస్తవి. అది కాలపై చిత్ర్యం.

శాంతి సౌఖ్యాలతో స్వచ్ఛందంగా మనుగడ సాగించడానికి, మానవతాను భావమే పూలబాట కావాలికాని, మానవ కల్పితాలైన, కులమతాలు, అధికారోన్నతులు ఆలవాలంకారాదని శబరిఅతిధేయ పరమార్ధం,

మతంగమున్యాశ్రమ మాహాత్మ్యాన్ని అభివర్ణించి, శబరి, శ్రీరాముని ఆజ్ఞప్తితో అతని సన్నిధిలోనే యోగాగ్ని భస్మీకృతగాత్రయై పునరావృత్తి రహిత పదాన్ని పొందింది. ఇంత విలక్షణంగా జీవితాన్ని సమాప్తింప చేసికొన్న పాత్ర శ్రీమద్రామాయణంలో ఇంకొక పాత్ర కానరాదు. అందుచేతనే శబరి శ్రీ త్యాగరాజస్వామికి, ఆధునిక కవీశానుల కారాధ్యయైనది.

ఈ కావ్య ముద్రణార్ధం సహాయంచేసిన వదాన్యవతి శ్రీమతి టొట్టు కళావతికి నా మంగళాశాసనములు. ఈచిన్ని కబ్బాన్ని ఆమోదించి ఆమోద

వృష్టి గురియించిన, హృద్యపద్య విద్యానవద్యులు, కవితా వాచస్పతులు డా॥ శ్రీ చేబోలు చిన్మయ బ్రహ్మకవి M A. P. H. D గారికి, స్నిగ్ధ హృదయంతో నన్ను నాకావ్యాన్ని అభినందించిన లలిత కవితారచనా లాస్య విన్యాస విదగ్ధులు శ్రీ కరుటూరి సత్య నారాయణ B. A. గారికి నా నమ స్సుమనస్సులు. రేఖామసృణంగా ముఖచిత్రాన్ని, ఇతర చిత్రాల్ని రచించిన బుద్దా సత్యనారాయణకు నాశుభాశిషములు. ఈ కావ్యముద్రణకు 1790 రూ. లు ధనసహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారికి నానమశ్కృతములు. ఈ గ్రంథాన్ని చూడ ముచ్చటగా ముద్రించి ఇచ్చిన విజయశ్రీ ప్రింటర్సు అధి నేతలకు నా శుభాశీస్సులు.

రాజమండ్రి — సహదేవ సూర్యప్రకాశ రావు.

29-5-86 — "రిటైర్డు" ప్రధానాంధ్రోపాధ్యాయుడు.

---

సవరణ : విరహిణీ శీర్షికలోని 16వ పద్య నాల్గవపాదాన్ని ఇలా సవరించుకొనుడు.

అననుకూల బాంధవ్యమునననుసరించె.

# అనుక్రమణిక

# ప్ర తీ క్ష

## శ బ రి

క్రౌంచ విపినమ్ము నుండి ఏతెంచు చుంటి
వే, తేనువరీ! యొకించుక విశ్రమింపు
మిచట, మా కుటీరాంగణ వృక్ష.ఫలము
లారగించి: మా వరివస్యలంది కొనుము. 1

ఈవు వచ్చిన దారిలో, ఇంద్రనీల
మణి గణాభ దేహు డొకడు; మహిత హేమ
కాంతి రేఖా మనోహర గాత్రుడొకడు,
గానిపించిరే, నీకనుల్ కఱవుదీర. 2

నిశిత బాణ ప్రపూర్ణ తూణీరములను;
దండ శరాశముల్ బోలు కోదండములను;
నార చీరలఁ దాల్చి యొప్పారుచుండ్రు,
వారు సుకుమార వీరకుమారులయ్యు. 3

ప్రాజ్య సాకేత రాజ్యనృపాల పుత్ర
వరు లవక్ర పరాక్రమోజ్జ్వలులు, రామ
లక్ష్మణులగు దెంచిరి రాజ్యలక్ష్మి వీడి
కానకున్ సీతతో, కైక కారణమున. 4

మెలిసరిగంచు పీతాంబరాలు లేవు,
ఆణి ముత్యాల హారాలు లేవె లేవు,
కటకములు లేవు; కాశ పటాలు లేవు,
వారు భీషణారణ్యాని, వాస ముంట. 5

అమ్మ! సీతమ్మ! నెవడో మాయావి, అపహ
రింప, బయలు దేరిరి గవేషించు కొనుచు
కొండ కోనల, కానల, కుహరములను
శోక వేదనానంత సంక్షుభితులగుచు. 6

దుర్గమారణ్య కంటక మార్గములను
నడచి విచ్చేయు చుందురు, నన్ను జూడ,
ఎన్ని ముళ్ళు గ్రుచ్చుకొనునో, ఎన్ని రాళ్ళు
తపులు కొనునో: వారి యడుగు తామరలకు. 7

శ్రీమతంగమహర్షి మహామహాస్సు
గల తపస్వి, మనస్వి, దిగంతరాంచి
తామల యశస్వి, తేజస్వి, అతడె నాకు
సదుపదేశ మొసంగిన సద్గురుండు. 8

మా కుటీరాంగణ సుమలతా కుడుంగ
పాళి పూచిన పూవులు భవ్యసౌర
భాన్వితమ్ములు; వసివాళ్ళు వాడ వసలు.
నిత్య నిష్యంద మకరంద నిధులు కరము. 9

మృదుల పుష్పాలు కోనగోళ్ళ చిదుమబడవు.
ఎంత సురగాలి వీచిన సుంత యేని;
తొడిమలెడలవు నునురెమ్మ కడలనుండి,
మా గురూత్తము ప్రోజ్జ్వల న్మహిమవలన. 10

ఋతువు లన్నియు నామనులే, పికీగ
ళస్ర వన్మధురాంచిత లలిత గీతి
కాముఖరితమ్ములే, మధుకర సముత్క-
రోదితామేయ ఝంకృతీ నాదగతులె. 11

కడల ఘూర్ణిల్ల జేయు ఘీంకారములను
ఆలకించుచుంటివె పాంథ! అప్రమత్త
కరులు, మాగురువరు మనః కల్పితములు,
కాన మాతంగ నామధేయాన బరగు. 2

"ఎంత తపము చేసినగాని సుంత యేని
మాకు సాక్షాత్కరింపని మంగళాంగు
డరుగుదెంచు నిన్ గాంచ తనంతతాను,
ఎంతటి యదృష్ట శాలినివే, నెలంత. 13

"భానుకులుడు నీకోసము వచ్చుదనుక
నీశిథిల దేహయష్టిని నిలిపి కొనుము.
శక్తికిని, రక్తికిని, భక్తి ముక్తులకును
కాయమే కదా యుపయోగకారకమ్ము. 14

"శ్రీరఘూత్తము చరణ నీరేజసేవ;
శ్రీరఘూత్తము శుభనామచింతనమ్ము;
కన్న, మంత్రముల్, పూజాదికములు లేవు,
విస్మరింపకు, జీవముల్ వీడుదనుక" 15

అని మతంగ మహాముని చనియె, పరమ
పదము జేరగా, యాశ్రమోపాంత సీమ
దివ్య రోచిర్మరీచుల దీప్తి జెంది,
కనులు మిఱుమిట్లు గొలిపె, చీకట్ల బాపి. 16

ముని యొసంగిన యుపదేశమును స్మరించు
కొనుచు, ప్రభునామము జపించుకొనుచు, నాటి
నుండి, ఎదురు తెన్నులు చూచుచుంటి నేను
ఎన్నియేండ్లు గమించెనో ఎఱుక లేదు. 17

అమృతసముల నీను తీయతీయని ఫలాలు;
మంచి వలపు విసులు; సంతసించినాను,
చక్కగా చవిజూచి, వాసనలు చూచి,
శ్రీరఘూద్వహు కైంకర్య సేవనలకు. 18

ఉండు ముండుము, వినవచ్చుచుండె, నెవరి
యడుగు సవ్వడియో, కాదు - యాశ్రమ మద
కరులు, వట భూమి హచ్ఛాయ కరుగు చుండె,
సూర్యు డస్త్రాద్రికిన్ జేగుచుండ నోవు. 19

సంజకెంజాయ లపరాశ సవదరింప
అంద చందాలు త్రుళ్ళింత లాడసాగె,
అలబుమ్మల సంబరమ్ములు చెలంగ,
నా హృదిని రేగె నేదోకోలాహలమ్ము. 20

స్నాన సంధ్యాదికృత్యముల్ సరగ దీర్చి;
ఆర మ్రుగ్గిన ఫలముల నారగించి;
తెరువరీ! తనివోవగా తేనెత్రావి,
ఈ యజినశయ్యపై శయనింపు మయ్య. 21

పొడుపు గుబ్బలి తెలిరేక పొడమ కుండ
లేచి, తీర్చి ప్రాభాతిక కృత్యములను,
వెడల వచ్చు, బాటావుకు వేసబోక,
నేను నాస్వామి కోసమే ఎదురు సూతు. 22

# విరహి

అది వినీలాభ్ర చుంబితా హర్మ్య పాద
పాదప చ్ఛాయ, దర్భ తల్పమ్ము నందు
విరహావేదనా పరిదీన విగ్రహుండు
శ్రీ రఘూద్వహు డొంటిగా గూరుచుండె. 1

ఎన్ని యేడులనుండియో ఇనకులేశు
రాక నెదురు చూచుచు నున్న శ్రమణి శబరి
యాశ్రమమ్మున కేగుచు, నచట విడిచి
రన్నదమ్ములా సుభగసాయాహ్న వేళ. 2

విరహి



విరహవేదనా పరిదీన విగ్రహుండు
శ్రీ రఘూద్వహుడొంటిగా గూరుచుండె. ప. 1

హరిణ శాబక మరు దెంచి యరయసాగె
జానకీ జాని వదన విషాదరేఖ. ప. 4

అస్తమిత భాస్కరుని యరుణారుణాంశు
వొకటి జాల్వాఱి, రఘురాముచికిలిసిలి
చెక్కిలింబడి, కన్నీటి చుక్కలోన
ప్రతి ఫలించెను సప్త వర్ణముల కాంతి. 3

సంజ కెంజాయ లింకను జాఱలేదు,
నెమరు వేయుచు దూర్వాంకురముల, నొక్క
హరిణ శాబక మరుదెంచి, యరయసాగె
జానకీ జాని వదన విషాద రేఖ. 4

అతడు హృదయేశ్వరీ విరహార్తమూర్తి,
నయనములు వివృతములు; శూన్యమ్ము చూపు,
అతని లోచూపు ప్రియరూప మరయుచుండ
నోపు, కాక – విస్మృతి యంత యొదవనేల. 5

ఒక్కనును వేడిగాటంపు టూర్పుబుచ్చి
కదలె నించుక, భీతిల్లి కన్నె లేడి
పాఱె చౌకళించుచు, దాని పాఱ జూచె
ఇన కులీనుడు కనుల మంకెనలు పూయ. 6

చంగు చంగు మటంచు, కురంగశాబ
కమ్ము, దవుదవ్వులకు బాఱె, కడిమిచెట్టు
కడకు జేరి, విభీత వీక్షాంచలాల
వెనుదిరిగి చూచి, మగుడ బర్వెత్తి పోయె. 7

కినుక ఏల శ్రీరామచంద్రునకు పొడమె,
మమత లూరించు మృగకిశోరమును జూడ,
స్మృతికి దట్టెను గాబోలు, హృదయ మర్మ
మంటు, పరిపూత సీతాపహరణగాధ. 8

ఆచరమ సంధ్య, రాముడు చూచినాడు
కీర మిథునమ్ములొ కవంక, గోరు వంక
మిథున మొక వంక, జక్కన మిథున మొక్క
వంక, కువకువ లాడుచు వలపుగులుక. 9

హారిణ శాబక విస్ఫారితాంబకముల;
వలపులుఁ గులుకు పులుగు జంటలను చూచి,
రాము నెదలోన భావములేమి యేమి
తొలకరించి, రాగిల్లెనో, తెలియరాదు. 10

పగుల చాటిన తీయని పండ్ల నేర్చి
లక్ష్మణ కుమారుడబ్జ దళాల నుంచి
పెట్టినాడు, శ్రీరాఘవు నెట్ట యెదుట,
అరగింపు డటంచును గోరినాడు. 11

ఒక్కదొన్నెలో జలము, వేఱొక్కదొన్నె
లో మధువు, తెచ్చియుంచి, శ్రీరామమూర్తి
చెంత నిలుచుండి యుండెను, శిరసు వంచి
ఒక ఫలము వెంట వేయుచు నొకఫలమ్ము. 12

ఈ ధరిత్రిలో సోదరు లెసగు చంద్రు
మేర మీఱిన ప్రేముడి మీఱ,కాని
లక్ష్మణుని వంటి తమ్ముడు లభ్యమౌనె,
మూడులోకాల నే లోకమునను గూడ. 13

అన్నగారి ఫలాశన మైన పిదప
లక్ష్మణుడు వటవృక్ష మూలమ్ము చేరి
కూరుచుండెను, తల పోసికొనుచు, వదినె
పల్కిన పరుష నిష్ఠుర భాషితముల. 14

చిమ్మటల రొద పొదరిండ్ల జీబుకొనియె,
ప్రాకి కొనివచ్చి జర జర త్రాచు జంట,
తిరిగి సౌమిత్రి చుట్టు, వెన్ దిరిగి పోయె,
బుస్సుమని, లక్ష్మణుండూర్పు బుచ్చినాడు. 15

“ఇది వసంత విభావరి హిమకరుండు
చల్ల చల్లని వెన్నెల వెల్లికలను
గురియు చున్నాడు, వాసనల్ గురిసి పవను
డనుకూల బాంధవ్యమును వహించె. 16

“నిదుర లేని నా నేత్రాల తుదల, చిలికి
చాలు చాలుగా కన్నీరు జాలువాఱు,
నిదుర లేసి నా వేదనా హృదయ మవసి,
విడుచు వేడి నిట్టూర్పులు విరతిలేక. 17

"కానిపించునే. నాకు. సీతానతాంగి,
ఎన్నటి కి నేని లక్ష్మణా! ఎచట నుండె?
ఏమి కడగండ్లు పడుచుండె? ఎఱుక గాదు
తస్కరించిన దెవరో? నిర్ధారణముగ." 18

అనుచు క్లాంతరవమ్మున అనుజుతోడ
చెప్పి, శ్రీ కౌసలేయుడు, సెజ్జ మీద
వ్రాలి, ఊర్చి, కన్నీటి నేత్రాలు తుడిచి
కొనుచు, చంద్రుని చూచి వాకొనియె నిట్లు. 19

"చంద్రుడవు నీవు, సూర్యవంశజుడ నేను,
లేశమేని వైషమ్యము లేదుమనకు,
కాన–నాపేర నీపేరు కలిపికొంటి,
రవిశశాంకులు చక్రినేత్రములు గారె. 20

"షోడశకళాప్రపూర్ణ విశోభితుడవు,
నింగి నీలాల దాటి మెలంగుచుండి
ఈ సమస్త జగత్తు నీక్షించుచుందు,
వెఱిగి యుందువు నా సీత ఎచట గలదో. 21

"ఆ విశాలవినీలవియత్పథమ్ము
నుండి, మము చూచుచున్నావు, ఒకరి క్షేమ
మొక్కరికి దెల్పి, పుణ్యమ్ము నొందవోయి
అదియొపడివేలు మాకు శశాంకమూర్తి". 22

"నీకరమ్ములు నా మేయి సోకినంత
ఏలకో తప్తహృదయమ్ము ఇవతళించె,
ఆ కరమ్ములు నా ప్రియురాలిమేను
తనిపి, నన్నలరింప వచ్చినవి యేమొ." 23

అనుచు పల్కిన రాము దీనాననమ్ము
గాంచు చుండిన చంద్రుని, కాఱు మొగిలు
తునక లెచ్చట నుండివచ్చినవో కాని,
క్రమ్మివేసెను, వెన్నెల కాంతి తఱిగె. 24

విపిన సీమల నెంతగా వెదకి చూడ
కానిపింపని కులకాంత కలికి రూపు
తలచికొనుచు, దూపిల్లుచు, తల్లడిలుచు
ఏమియేమియో రాముడూహింప దొడగె. 25

"కానిపింపవా నీవు నాకనులు కఱవు
దీరగా కాని పింపవా?
దెసలు దెసలు
పల్లవింప నటించు శంపాకుమారి
వోలెనైన గాన్పింపవా, 26

పూర్వ శిఖరి

తగలు చీకటి కౌగిలింతల తొలంగి
మెఱయు ప్రథమ సంధ్యారేఖ కరణినైన
కానిపింపవా నీవు; 27

నిశానిగూఢ

గగన సీమఁగార్కొన్న కార్మొగిలు తెరల
వీడి, మినక్కని తరళించి, వెఱపుదోప
కనులు పక్ష్మలించెడు తారకానతాంగి
సరణినైన కాన్పింపవా? 28

ఆశానిలీన

హృదయ మాశాపథాన, నిరీహా విరిసి
పో నెగసిపోవలసినదియే? నిగూఢ
నాంకితా ఖర్వపరివేదనల మునింగి
బ్రతుకు విరహా వీధిక వేగ వలసినదియె,
కానిపింపవానీవు. 29

నేనీ నిరంత
రోచ్ఛ్వసిత నేత్ర పాళితోనుభయ సంధ్య
లేకమై పోవ, పొనుగు వోయిన విముక్త
గళముతో, వేడినిట్టూర్పుగములతోడ,
ఎవరికోస మెవరి కోస మెదురుసూతు,
కాని పింపవానీవు, 30

సుఖప్రసక్తి
లేని ఈ త్రిజగత్తు మొత్తాన నొక్క-
రుండ, కన్నీటి పదమునై యొదిగిపోయి
మిగిలి పోదు నా యూర్పు రేకగ వెలింగి,
కాని పింపవా నాకు. 31

# స్మృతి

తన తెగను సంస్కరింప చేసిన ప్రయత్న
మెల్ల నిష్ఫలమై పోవ నిరీహచెంది
శబరి, నేతృత్వమును వీడి శాంతజీవ
నమ్ము నెఱప కాసారతీరమ్ము జేరె. 1

అతుల తేజో విరాజితు డమలమూర్తి
శ్రీమతంగర్షి, జపతప హోమనిరతు,
డాసరస్సున స్నాన సంధ్యాదినిత్య
కార్యముల దీర్పవచ్చు త్రికాలములను. 2

ఒక్కనాడు పూపొదరింటి నుండి, శబరి
యామునీంద్రుడు స్నాన సంధ్యాదికముల
మధురకంఠమ్ముతో, పూత మంత్రపూర్వ
కముగ, నాచరింప గని, హర్షమును బొందె. 3

ఆ తపస్వి, సంధ్యాది కృత్యములు నెఱపి
స్వీయ సిద్ధాశ్రమమునకు వెడలు చుండ
ఛాత్ర సహితుడై, వెన్నంటి శబరి పోయి
అతని యాశ్రమ వాటిక నరసివచ్చె. 4

అరసి వచ్చిననాటి నిశాంత మందు,
అమల లవలీలతాకుంజ మందు, పఱచి
కొన్నతృణ శయ్యపై గూరుచున్న, శబరి
హృదిని, చిత్ర భావాలు రేకెత్తసాగె. 5

ఉదయ భాస్కరు తొలికిరణోత్కరమ్ము
లా లతానికుంజాంతర మందు జొచ్చి,
పడతి కుంచిత భ్రుకుటిపై పడి చురుక్కు-
మనగ, అదరి, లేచి చనియెనడవిదారి. 6

అడవి మార్గాన చనిచని, అడ్డు పడిన
నొక్క సెల యేరుదాటి, నవోదయాన
మింట బాఱు పయోదమ్ము వెంట నంటి,
కొండ మొదలు దరిసె సుద్ద కొమ్ములకయి. 7

విన్నువీధి పొడమకుండ వేగుజుక్క,
అను దినమ్ము శబరి, యాశ్ర మాంగణమ్ము
చక్కగా నూడ్చి, కలయంపి జల్లి, తీర్చి
దిద్దు చుండును ముగ్గుల తీరులెల్ల. 8

ఆ మతంగ తపస్వి స్నానార్థ మేగి
వచ్చు చుండి, నిజాశ్రమ ప్రాంగణమున,
రంగు రంగు హొరంగుల రంగవల్లి
కలను గని, చోద్యమగ్గలికముగనందె. 9

కొంత తడవట నిలబడి, వింత వింత
మ్రుగ్గుల రచనా వైదుష్యమునకు నలరి,
మనసులోన కొండాడుచు, వాని చూచి
శిష్యతతిని, వారలు నతశీర్షులైరి. 10

ఆశ్రమాంగణమ్మున నెవ్వరట్టు లూడ్చి
మ్రుగ్గు లిడిరో, తెలియగోరి, మునివరుండు
ద్వారమును జేరి యొక్క రాత్రమున, చూచు
చుండ, వచ్చె శబరి నీటి కుండతోడ. 11

ఆశ్రమద్వార గేహళి కంజలించి,
వనిత అలవోకగా చేసి పాచిపనులు,
ఎఱిగి గేహళి కరుగ నుంకించుచుండ
ఆమె కడ్డు నిలిచి ముని యనియెనిట్లు. 12

"సిద్ధమున్యాశ్రమాంగణ సీమ శుభ్ర
పఱచి, రంగు రంగుల రంగ వల్లికలను
తీర్చిదిద్దుచుంటివి, మాకు తెలియకుండ,
ఎవ్వతెవు నీవు తల్లీ! వచింపుమమ్మ." 13

తలవని తలంపుగాఁగ, ప్రత్యక్షమైన
యామునీంద్రుని పలుకుల నాలకించి,
వివశయై పడిపోయె నా వెలదిమిన్న
వానిచరణాబ్జ యుగళి నిశ్వాస మెగయ. 14

ఆ యతీంద్రుడా మెను లేవ దీయ బోవ,
అతని శ్రీపాద పంకేరుహముల నామె
విడువ నొల్లక, ఏడ్చుచు వెక్కి వెక్కి,
పలుక సాగెను గద్గద స్వరముతోడ. 15

## శబరి

"చేసిన యఘసంఘాతమ్ము మాసిపోవ;
చేయుచుంటి నీ యంఘ్రిసంసేవనమ్ము,
ఎఱిగియుంటి ప్రాయశ్చిత్త మే, విశిష్ట
శిక్ష నావంటి పాపిష్ఠిజీవి కనుచు. 16

"కష్ట నిష్ఠురగాథా ప్రపుష్టమయిన
బ్రతుకుబాటలో, లేదు రవంతశాంతి,
అడుగులిడినకొలంది ఈర్ష్యాసహనము
తే ముసురుకొని, నన్నుకుంచించి వైచె. 17

"నన్ను గన్న, నానామమ్మ విన్న, జనులు
తరిమి తరిమి కొట్టుదురయ్య తాపసేంద్ర!
దీన, మిత్రహీన, చరిత్ర హీన, గాన,
కరుణ చిప్పిల్లగా నను గావుమయ్య! 18

"అన్నెమును పున్నె మెఱుగని యాత్రజనుల
ధనము, మానము ప్రాణవితాన మెల్ల
అదయహృదయాన కొల్ల గొన్నట్టి, అటవి
జాతి కేకైక నాయిక, శబరి నయ్య! 19

మతంగుడు

"శబరి కన్యవా నీవు? సచ్చరితవమ్మ,
నీ మనఃపరివర్తన; నీ నిసర్గ
మంజుల స్వభావము నెల్ల మనవిచేసి
నాడు నాకు, శ్రీ నిర్మలానందు డెలమి. 20

## శ బ రి

"నిర్మలా నందు డెటిగించెనే మహాత్మ!
నాచరితమెల్ల! అతడే నాహితైషి,
గురుడు, సోదర తుల్యుడు, నిరత మతని
బోధనల చేతగాదె, ప్రబుద్ధనైతి. 21

"సంస్కరింపగ నామూఢ జాతినెల్ల,
పూనుకొంటిని, నిశ్చల స్ఫూర్తి తోడ,
కాని, విఫలనైతిని ద్రోహి కారణమున,
విసిగిపోయితి సంఘ జీవితముతోడ. 22

"విసిగి వేసారి నా తెగన్ వీడివచ్చి
వినయసౌశీల్యశాంతజీవితముగోరి
నాను నిష్కామ హృదయమున, నాటినుండి
చేయు చున్నాను భవదంఘ్రిసేవ నమ్మ. 23

"నిర్మలానంద శబరుల స్నేహగరిమ,
లౌకిక విదూరులు మునితల్లజులు సహిత
మన్యథా యెంచి నిర్దయులగుచు, వాని
జీవకావ్యమునకు స్వస్తి చెప్పినారు. 24

"అతని విజ్ఞాన సౌరభ మఖిల దిశల
నల్లుకొనకుండ, మాయించి రార్యవరులు,
అందులకు హేతుభూత మేననుచు నెంతొ
కుమిలి కుమిలి, కనారిల్లి, క్రుంగిపోతి. 25

"అతని సమాధి సన్నిధి కనుదినమ్ము
వెడలి, అర్పించి వత్తును విరుల గముల,
నంత కన్నను ప్రియ కార్య మరయలేదు
నాకు, ఇంత శోకమున నేకాకినయ్యు! 26




ఆతని సమాధి సన్నిధి కను దినంబు
వెడలి అర్చించి వత్తును విరులగముల. ప. 26

## మతంగుడు

“విస్మరింపు మీరావు గతజీవిత చరిత్ర.
చుట్టు మింక శ్రీకారము, శుభ్ర హృదయ
ఫలకమున, నవ్య జీవిత భవ్యకృతికి,
పుటలు మానవతార్ద్రమై పులకరింప. 27

“ఇంతలోకమ్ములో నిసుమంత చోటు
నీకు లేక పోయెనె, శబరీ కుమారి!
రమ్ము మా పర్ణశాలకు, మమ్ముజూచు
కొనుము, మాతృ వాత్సల్యమ్ము కొనలువోవ. 28

## శబరి

“సవర కాంతనే నెట్టులాశ్రమమునందు
నుండు దాన” నంచు శబరి యుల్కిపడుచు
లేచి, యాశ్రమముగలయ జూచి, కనక
నెవరి, గలయే యటంచు భావింపసాగె. 29

# స్వాగతి

ముత్తైములు, పవడాల్కల బోసినటుల,
చెందోవలు తెలిదమ్మిలు చెలువు మీఱె,
శబరి యాశ్రమవాటికాసవిధ సరసి,
కమ్మ కమ్మని వాసనల్ జిమ్ముచుండె. 1

తెలుగు మగనాలి సిందూర తిలక మటుల,
వెలుగు లీనె తూర్పు ముఖాన వేఁగు జుక్క,
కలగి కప్పిరి చీకట్లు పలుచ బాఱె
పైడి వెలుగు జిల్గుల తెల్లవాఱనుండె. 2

అంబు జాత పత్ర చ్ఛాయ, హంసయొకడు,
పరమ హంస క్రియ, కుముదాంతరము నందు
ఆసనస్థుడై కూర్చుండె ధ్యాననిష్ఠ.
అచటి మునిజన సాహచర్యమ్ము కతన. 3

బాల భానుని తొలి కిరణాళిసోకి,
విచ్చి కొన్న వారి జగర్భ పీఠినుండి
ఎగయ ఝమ్మని తుమ్మెదల్, కృత్రిమాంధ
మలమొకాసార పరిణాహతలమునెల్ల. 4

"రామ! శ్రీరామ! శ్రీరామ! రామ! రామ
రామ! రఘురామ! రఘురామ! రామ! రామ"
యనుచు కంపిత కంఠాన వినగవచ్చు,
శ్రమణి శబరి హృదంత రాళమ్మునుండి. 5

రామనామ తారక మంత్ర రాజ మనిశ
మామహృద్వీథినదియించు, ఆమె కదియె
ఏడుగడ, నిత్య జీవిక, హృదయ దీప్తి,
ఆయమకు భక్తి ముక్తి దాయకము కరము. 6

ఆశబరి, పునీతాశ్రమ ప్రాంగణమున
నలరు నవ చూతశాఖ శాఖాంతరముల,
కీరశారికల్ రామ సంకీర్త నమ్ము
నలుపసాగెను, తీయని ఎలుఁగుతోడ. 7

రామ, శ్రీరామ, రామ కీర్తనము, ప్రతిల -
తాంత హృదయాంతరమ్ముల నలర జేసి,
కోలని కెరటాల యుయ్యాల కలయుతూగి,
విఁయ బాఱెను భూనభోంతరములందు. 8

ఆ శకుంత కీర్తన హాళాహాళికి, శబరి
పర్ణశాలాంతరము నుండి వచ్చి, చూచి
విభ్రమించి, ఆమెయు నాలపింపసాగె
"రామ శ్రీరామ శ్రీరామరామ" యనుచు. 9

అంత కౌముదీకమనీయ కాంతి, శబరి
యక్షులకు దట్ట, ఱెప్పలల్లార్చి చూచె,
నీలి మాభ్రము శంపయు బోలె వచ్చు
శుభ్ర తేజః పిహిత దివ్య సుందరులను. 10

శ బ రి

"ఎవరు రావచ్చువారు? ఇంకెవరు, వారె
జంగమ ప్రభా కిరణ పుంజముల కరణి,
నాదుతమిబాప వచ్చుచున్నారు వారు,
వారె రామ లక్ష్మణులు, కృపామహితులు. 11

"ఎన్ని గవ్యూతులను ప్రయాణించినారో,
ఎట్టిగండ శిలాగ్రముల్ మెట్టినారో,
ఎన్ని ముళ్ళ కాళ్ళను గ్రుచ్చుకొన్నవో భ-
రించి వచ్చు చుండిరి, నన్ తరింపజేయ. 12

"ఎంత సుదినమ్ము నేడు, శకుంత రాజి
"రామ శ్రీరామ, శ్రీరామ రామ" యనుచు
పలుక సాగె నా స్వామికి స్వాగతమ్ము,
నెమ్మి బృందమ్ము నృత్యమ్ము నెఱపుచుండ. 13

"గడ్డిపూవులు తల లెత్తి గాంచుచుండె
నెవరి పదపంకజమ్ముల కెఱుగ దలచి,
కొలనిలోపలి మీనము లొలసి పడుచు
నేరిని గన పదేపదే ఎగయుచుండె. 14

"పవన వీచుల కీదివ్యపరిమళమ్ము
లొక్కపరి, ఏ విరులతోట నుండివచ్చె,
చూపుద్రిప్పక నెవరిని చూచుచుండె
ప్రకృతి యంతయు నొక్క నేత్రముగ విరిసి. 15

"వచ్చి వేసెను, నాస్వామి వచ్చి వేసె,
ఎంతటి యదృష్ట శాలిని నేను, ఎన్ని
ఎన్ని జన్మాంతరముల సుకృత ఫలమ్ము,
వచ్చి వేసెను నాతండ్రి వచ్చివేసె. 16

ఆశ్రమ ప్రాంగణమ్మున నడుగు బెట్టి
నట్టి దాశర థీశుని యజ్జదోయి
"రామ శ్రీరామ, రఘు రామ" రామ" యనుచు
నవశమై పడిపోయె నా సవరకాంత. 17

"నెరసిన తలను, ఋషిచేత నిమురఁ రాను,
డామె తెలివంది వేడి బాష్పాంబు కణము
లురలగా, లేచి, విచలిత స్వరము తోడ
ననియె, వారి పాదమ్ముల కంజలించి. 18

"రండు శబరి పూరింటికి రండు, ఎన్ని
నాళ్ల కెన్ని నాళ్లకు వచ్చినారు మీరు,
ఏను మీరాక కోసమై యెదురు చూడ,
కనులు రెండును కాయలు కాచెనయ్య." 19

# పరివస్య

ఆశ్రమాంతర పూర్వ దిశాంత మందు,
వికుల గద్దెలు రెండు శోభిల్లు, శబరి
వానిపై నివణ్ణుల జేసి భానుకులుల,
వారి పాదముల్ కడిగె పావన జలాల. 1

తజ్జలమ్ముల తనదు మూర్ధమ్మునందు
జల్లుకొని, తడి యొత్తి, శ్రీ చరణపాళి
చక్కనొత్తి, వారల పథశ్రమము వాపి
ఇచ్చె నర్ఘ్యము, సద్భక్తి ఎసక మెసగ. 2

చందనాను లేపనముల సరగ జిలికి;
నవ్య కుసుమాలతో నర్చనమ్మొనర్చి;
పూత సలిలాల నభిషేక మొనర చేసి;
రాము పాదాలు పూజించె శ్రమణి శబరి.

విమల భక్తి ప్రపత్తులు, విరిసి పోవ
రామలక్ష్మణులకు సపర్యలను చేసి,
ఓడికలు గట్టు కన్నీటి నొత్తు కొనుచు
పలుకసాగె శబరి రఘూద్వహునితోడ.

శ బ రి

"నల్లరాతిని, నవ జీవనమ్ము, పులక
రింప, సుమనోమనోహరాకృతిని, తీర్చి
దిద్ది, ఇలు నిల బెట్టిన దివ్యపదము
లంటి పూజించి నే ధన్యురాలనైతి.

"జనకు డర్చించి కడిగిన చరణ యుగళి,
అమ్మ సీతమ్మ ఒత్తిన అడుగు దోయి,
భద్రు నొదల పెట్టిన పాద పాళి,
నంటి పూజించి నేధన్యరాలనైతి. 6

"చిత్రకూట శిఖరి మీరు జేరినపుడె
నిన్ను గన వచ్చు రామావనీశుడాశ్ర
మమ్ము నందాక కాపాడుకొమ్మటంచు
అస్మదాచార్యుడందె నిర్యాణ పదము. 7

"నాడెరచియింప మొదలిడి నాను, వింత
వింత రంగుల పత్రాలు, విరులు దెచ్చి,
పుష్పసింహాసనమ్ములు పూర్తి చేసి
నాను, దీక్షతో, పక్ష దినాలలోన. 8

"ఎన్ని నాళ్లాయెనో నేటి కించుకేని
వాసనల బాయఁగాలేదు, వాడలేదు,
మాసి పోలేదు పూలసింహాసనములు,
మద్గురుశిరోవతంసుని మహిమ వలన. 9

నీలినింగిని జూచి, నీలాల జలద
పాళికల జూచి, నీలికల్వలను జూచి,
నీవనెడి భ్రాంతి, దినము లెన్నెన్ని గడపి
నానో, ఎఱుక నాకిసుమంత యేని లేదు. 10

"ఎవడో, సీతా సతిని మ్రుచ్చిలించి, యామె
దర్శనమ్ము, నాకే జని దక్కకుండ
జేసినాడు, దుస్సహ దుఃఖ శీర్ణహృదుల
జేసి మిమ్ము వేదనల ముంచెత్తినాడు. 11

"ఆమె నెవ్వతె గానెంచి యుపహరించె
నానిశాచరు, డామె మహాపతివ్ర
తామతల్లి, అయోనిజ, ఆమెకన్ను
లెత్తి చూడఁడయి నశియించిపోవు. 12

అమ్మ సీతమ్మతో గూడి యరుగు దెంచి
నన్ను, నా యాశ్రమమ్మును, నవ్య దీధి
తుల వెలార్చి, పూత మొనరింతురని ఎంత
పొంగి పోయితినో అంత క్రుంగి పోతి. 13

"ఐనదైనది- మీరైన యరుగు దెంచి
కనుల పండువుసేసి, పోకార్చి నాదు
భవ భయార్తి - మీరిటు రాక పట్టణమున
కటులె, తరలెదరని భయ మంది నాను. 14

ఇంత సవ్వడి వినిపించినంత, వీను
లొగ్గి, కన్నులింతలు చేసి, ఉభయసంధ్య
లందు ద్వార గేహళి జేరి అడవిదారి
నరయుచుందు మీరరుదెంతు రనెడియాస. 15

వత్తురనునాస లో చివురొత్త, మనసు
ముక్తమోదమున రవంత మునుగబోవు
నంతలోననే నైరాశ్యమలమికొనగ
నీవురావని హృదయమే నీరవించు. 16

"ఇపుడు వత్తురపుడు వత్తురెపుడు వత్తు
రో యెఱుకరాక, కుమిలి వాపోయినాను,
ప్రతిదినమ్మొక యుగముగా వెతల బడితి,
ఎట్టకేలకు దర్శన మిచ్చినారు. 17

''మా గురువు,'' శ్రీరఘూద్వహు స్మరణకన్న
వేరె మంత్రము, తంత్రము వేరె లేదు,
అదియె తారక మంత్ర మయ్యదియె దివ్య
తంత్ర'' మంచు, వక్కాణించి తరలినారు. 18

"రామ చిల్కలకున్ రామరామ యనుచు
గఱపినా, నవ్వి గోరువంకలకు నేర్పి,
''రామ శ్రీరామ శ్రీరామ రామ'' యనుచు
నన్ను గూడి భజించి గానమ్ము సేయ. 19

"హృదయ మారగా మిమ్ము సేవించుకొని-
నా; ఇతర మేమెఱుంగని జ్ఞానహీన,
అస్మదాచార్యమణికి లభ్యమ్ము గాని
దివ్య సందర్శనమ్ము ప్రాప్తించెనాకు. 20

"కన్న తండ్రి వి నాకు – నాకన్న నూట
యేమి, ఈ రేడులోకాల కీవు తండ్రి
వన్న్య లెఱుగగు నీ హృదయమ్ము, సకల
వేద వేదాంగ శాస్త్రకోవిదులు తక్క. 21

"ఈవు కరుణారసాంచిత హృదివి, హీన
దీన మూర్తుల పాలిటి దిక్కువీవ,
ఎంతో వాత్సల్య గరిమ ప్రఫుల్లింతలాడ,
నన్ను జూడ, నడచి వచ్చినావు రామ!" 22

## రాముడు

"దండకాట వీదేశ మధ్యమ్మునందు
మేము దర్శించినట్టి సమిద్ధచరితు
లనుపమ జపతపశ్శాలులైన మౌను
లొక్క యెత్తు, నిన్ గాంచుట యొక్క యెత్తు. 23

"నన్ను గూడి వైదేహికి నిన్ను జూచు
భవ్య భాగధేయమ్ము రవంత లేదు,
నిన్ను బోలు మహామహి మోన్నతులను
గాంచు భాగ్య మెల్లరకును కలుగునొక్కొ. 24

"సాగుచుండెను దేవతార్చనలు, జపత
పాదిక మవిఘ్నముగ, ఘోర వన్య జంతు
భీతిలేక, రాత్రించర భీతిలేక,
శ్రీమతంగర్షి మహిమాతిరేకమునను." 25

శబరి

"దుష్ట శిక్షణ కోసమ్ము, శిష్టరక్ష
ణమ్ము కోసమవతరించి నారు మీరు,
జపత పోగ్ని హోత్రమ్ములు సాగుచున్న
మీ కృపాపాంగ వీక్షా సమీక్ష వలన 26

## రా ము డు

"నవవిధమ్ముల భక్తి గణమ్మునందు,
భక్తి సరణియే మోక్ష సోపానపథము,
మత్కథాశ్రవణము కన్న, మద్గుణాళి
సంస్తవము కన్న; సత్పరిచయముకన్న. 27

జ్ఞాన భావుల కన్న, సత్కర్మరతుల
కన్న, నిష్ఠాగరిష్ఠులకన్న, సకల
వేద విద్యా విదులకన్న, నాదు హృదయ
వరులు, స్వార్థమేలేని సద్భక్తవరులు". 28

# ఆతిథేయము

"అయ్యోరామ! పరధ్యాన మందినాను
మిమ్ము గాంచిన పారవశ్యమ్ములోన,
విస్మరించితి యాతిథ్య విషయ మేను,
రండు మీరీ బ్రుసీపయి కూర్చుండు డయ్య. 1

"వనము నందలి చెట్టు చెట్టునకు తిరిగి
తిరిగి, మిగుల మాగిన పండ్లు, తేనె లీను
పండ్లు, చవిచూచి కోసుక వచ్చినాను
కోరి, శ్రీరాఘవేంద్ర! మీకోసమేను". 2

అనుచు తామర పత్రాల నునిచి, పలువి-
ధమ్ములైన ఫలమ్ముల, దాశరథుని
కట్టెదుట బెట్టి, వినమిత గాత్రయగుచు
నారగింపు డటంచును ప్రాంజలించె. 3

తానుకొఱికి తిన్న ఫలాలతోనె, అతి
శ్రేయ సత్కార మొనరించు బోయముగుద
నుగ్ర దృష్టుల గాంచి, చేయునదిలేక;
బుస్సుమని లక్ష్మణుండూర్పు బుచ్చినాడు. 4

శ బ రి

"చందమామరావే; రామచంద్ర తినవె"
యనుచు తల్లి కౌసల్య ముద్దార కోరి
కోరి, గోరుముద్దలు నీకు కుడుపబెట్టె,
నామెప్రాక్తన పుణ్యమే మనగ వచ్చు. 5

"ఎంతరుచి యంత నీ కూరాత మేనుతెచ్చి
యుంచిన ఫల సందోహ మందొక్కటేని
నేను చవి చూడకుండ నూనినది లేదు;
కడుపు నిండ భుజింపుము విడువకుండ. 6

"ఇవ్వి రామా ఫలమ్ములు, ఇవ్వి జామి
ఫలము, లివి యలో నేరేటి ఫలము లివ్వి
కర్ర పు టనంటులివ్వి ద్రాక్షా ఫలమ్ము
లివ్వి సీతా' ఫలములారగింపుమయ్యా."

శబరి యెంగిలి పండ్లను సన్నుతించు
కొనుచు, భుజియించు చుండిన మనుకులునకు
'సీత' యను మాట వీనుల జేరినంత,
మనసు కలగి, కన్నుల బాష్పకణముల[illegible]

ఆతిథేయము



"ఎంతరుచి మంత మీ౯ చూతకై మేను తెచ్చి
యుంచిన ఫల సందోహ మందొక్కటేని
నేను చవి చూడకుండ మానినది లేదు;
కడుపు నిండ భుజింపుము విడువకుండ. 6

## శ బ రి

"రామ చంద్ర! నేను మహాపరాధనయ్య,
జ్ఞప్తి కెలయించి సీతను, తప్త హృదయు
జేసి, తీవ్ర వ్యథల పాలు జేసినాను."
అనుచు రాముని కన్నీటి కనుల నొత్తె. 9

శ్రీరఘూద్వహుడించుక సేదదేఱి:
మెల్లగా పక్వఫలముల మెసవి, జుంటి
తేనియను గ్రోలి, లేచి సంతృప్తి మీఱ,
నాశ్రమ ప్రాంగణమ్మున నడుగు వెట్టె. 10

# మహస్సు.

రా ము డు

"విటపి శాఖల తడియార బెట్టి నట్టి
నారకౌపీనములు, నార చీరచాలు,
ఇప్పు డార బెట్టినటు కాన్పించు చున్న,
వవ్వి యేమునిచంద్రుని వమ్మ! శబరి."

శ బ రి

"శ్రీమతంగ గురుని నారచీర, లెన్ని
పండ్లు పూండ్లను గడచి పోయినవో, వాని
నార వేసి, – ఇప్పుడె తడియార బెట్టి
నట్టులుండు మహర్షి మహస్సు వలన. 2

"అదే మతంగ మునీంద్రుల యాగ వేది,
అగ్ని హోత్ర పూజావిధి యహరహమ్ము
నెటుల సాగుచున్నదో పరికించినారె
పరిమళాంచిత దీప ధూపములతోడ. 3

"ముదిమిపై కొన్న మద్గురు మూర్తి కొఱకు,
సప్త నీరధుల్ కొలనుగా జననమందె,
స్నాన సంధ్యాదికృత్యముల్ చక్క దీర్చి
దారుణ తపస్సు చేసె, మతంగమౌని. 4

"మీరెఱుగరె మద్గురుని యమేయ మహిమ,
వారి చరణాబ్జ నిత్యసేవా సపర్య
వలనగాదె, మీ శ్రీపదాబ్జాతయుగళి
దివ్య సంసేవనమ్ము సిద్ధించె నాకు. 5

"బడుగు బోయను, వయసుపై బడినదాన,
లౌక్య మేమియెఱుగ, నాత్మైక్య మెఱుగ,
చెదరని మనస్సుతో నేను చేసినట్టి
సేవనమ్ములు మీకు నచ్చినవా లేదా." 6

## రా ము డు

"చేతులారగా సేవలు చేసినావు,
హృదయ మారగా నాతిథ్య మిచ్చినావు,
అంత రింద్రియ బహిరింద్రియములు కలియ,
అంత కన్న కావలయునే యీ పుత్తురాల. 7

"ప్రీతి పెంపార నీవు సల్పిన సపర్య,
మాకు పరితృప్తి నొసగుటే కాక, మైథి-
లీవియుక్తి బాధా తప్త హృదయమునకు
ఇంచు కంత ప్రశాంతి కల్గించెనమ్మ. 8

"నీ పవిత్ర ప్రవర్తన, నీదు నెమ్మ
నమ్ము, నీ సత్య వాక్పాలనమ్ము, స్వార్థ
మేమి యును లేని శుశ్రూష, ఎఱుక చేసి.
నాకు హితవాసంగె కబంధనాముడిట్లు. 9

"ఋశ్యమూకాద్రి గలడు సుగ్రీవు డర్క
సూను డతిలోక బలశాలి, శూరు డతని
స్నేహ మొనరించి సాయ మాసింప, కలుగు
మీకు సకల శుభమ్ములు మిహిర వంశ్య!" 10

శ బ రి

"రామ చంద్ర! మీరలు రాక రాక వచ్చి
నా బ్రతుకు దారి విరియించి నారుపూలు,
నాచరమ సంధ్యవేళ ఘృణా ప్రపూర్ణ
లగుచు, మోక్ష పదము జేరనానతిండు 11

మహస్సు



రాముడ నుమతింపగ, శ్రమణీమతల్లి
అంజలి ఘటించి, జ్వలిత యోగాగ్ని జిహ్వా
కాంతరముల భస్మీకృత గాత్ర మాయె,
రామ లక్ష్మణుల్ విస్మయాక్రాంతులైరి. 13

శబరి పల్కులాలించి కౌసల్యసూను
డించుక చలించి, నిట్టూర్చి. ఇచ్చెనుదల,
నెరసి పోయిన యూయమ కనులు చూచి,
ముడుత వారి, వడంకెడిమొడలు చూచి. 12

రాముడ నుమతింపగ, శ్రమణీమతల్లి
అంజలి ఘటించి, జ్వలిత యోగాగ్ని జిహ్వా
కాంతరముల భస్మీకృత గాత్ర మాయె,
రామ లక్ష్మణుల్ విస్మయాక్రాంతులైరి. 13

ఎండవేసిన వలువలదృశ్య మాయె,
ఆశ్రమోపాంత కాసార మంతరించె:
యాగవేదికలోని, నిత్యాగ్నిహోత్ర
మంతలోన చప్పబడి చల్లారి పోయె. 14

వాని పర్ణకుటిక మటుమాయ మయ్యె,
అంత శ్రీరాముడాసీనుడైన పూల
గద్దె, భూరి భూమీధ్రమ్ముగా నెసంగె,
పాఱె నొక యేఱునద్దాని పాదమంటి. 15

ఆ గిరియె, రామగిరిగ విఖ్యాతినందె,
శప్తుడై, ప్రియావిరహ సంతప్తుడైన
ఒక్క యక్షునకు నివాస యోగ్యమాయె,
ఆస్రవించు నదియె శబరీస్రవంతి. 16

కొండ కోనల, చఱియల, గండశిలల,
అడవి దారుల, అంధ గుహాంతరముల,
పాఱి జల జల, గలగల, బయలు జేరి
క్రేళ్ళువాఱు పావన శబరీ సరిత్తు 17

తెలుగు మాగాణ మెల్ల విస్తృతముగాగ
పసిడి పచ్చని పైరులు పండి, దేశ
మెల్ల నిత్యసుభిక్షమై యుల్లసిల్ల,
వృద్ధ గౌతమిలోన విలీనమాయె. 18

# ఉచ్ఛిష్టము

రా ము డు

"అంబుధిజలాల మజ్జనమాచరించి
దీక్షతో పితౄణమును దీర్చినాము,
నాయెడంద సముత్కటానంద మంద
మునిగె భవితవ్యమును తలపోసికొనుచు. 1

"ఎంగిలి ఫలాల నేనారగించుచుండ
చూచి, కినుకతో లోలోన కనలినావు,
నీమనో భావముల్ గమనించికూడ,
అపుడు మిన్నకున్నాను పల్కకుండ. 2

"నేనె తానని, తాను నేనే యటంచు
నెమ్మది విరియు భక్తి భావమ్ము కాని,
ఎంగిలి ఫలాల భుజియింప నిడు మనుంటె
నన్న భావమే శబరి కింతైన లేదు. 3

"భగ్గుమని మండు యోగాగ్ని మధ్యనుండి
దరవికస్వర సూనమ్ము కరణి, వాస
నలను జిమ్ముచు, క్రమ్ముచుజిలుగు వెలుగు,
దివికి నెగసి యాయను గురుదేవు జేరె. 4

"శ్రీమతంగర్షి యాశ్రమ శ్రీమహస్సు
గాంచినావు కన్నార లక్ష్మణకుమార!
అంతటి మహర్షి శిష్యురాలైన శబరి
హృదయ మెంతపునీతమో ఎఱుగనగునె. 5

"ఎవతె గాశబరీ మాత నెంచినావు.
నిలువునిలువెల్ల భక్తి పూర్ణించుకొన్న
అతులిత బ్రహ్మచారిణి, అస్మదీయ
చరణ నిత్య సంసేవ నాసక్తురాలు. 6

"అమ్మరొయొసగెడు కాలకూటమ్మునేని
స్వీకరింపక పసిపాప విడుచునేమి,
పారవశ్యమ్ముతో భక్తవరులొసంగు
నేపదార్థమేని తిరస్కరింపగలనె. 7

"నీవు నేనను భేద మొకింత లేక
"ఆత్మవత్సర్వ భూతాని" యనెడు సూక్తి
జీవితమ్మున కాదర్శమై వెలుంగ,
ప్రతి హృదిని మానవత చెలువారవలయు. 8

"ఆత్మ లాత్మలు సన్నిహితాత్మలైన,
వాని కధినేత నేనెగా, వక్ర భాష్య
మేల? ఏకాత్మ రూపమై ఈ జగత్తు
ఎసగు చుండంగ ఉచ్ఛిష్ట మెచట నయ్య. 9

భక్తునకు బ్రహ్మకు నవినా భావబంధ
మేగదా! అట్టిచో, కులమేడ. జాతి
యేడ, మత మేడ, ఎంగిలి కేడ తావు,
సాత్త్విక ప్రేమలో నన్ని సమసిపోవు". 10

రామ చంద్రుడు, లక్ష్మణ స్వామి తోడ,
సూక్ష్మ విషయముల్ ముచ్చటించుచు, తలంచి
కొంచు సీతను, పదము సాగించినాడు
అల్ల నల్లన ఋశ్యమూకాద్రి జేర. 11

సమాప్తి.

# మీరా

మోయగరాని నా బ్రదుకు
　మోదవిషాదభరాలసాక్తమౌ
గేయముగా, నిశాదివము
　ఖేలనమాడుచు పాడుకొంచు, నీ
చాయవసింపవచ్చితిని
　స్వాగతగీతుల పిల్వకుండ, కృ
ష్ణా! యెటనుంటివోయి
　యమునాపరిణాహతటీవనీస్థలిన్.

తలపులు తీరు తీయముగ
　దారులు తీసిన నాటినుండి, నే
గోలుచుచునుంటి, నా మనసు
　కూరిమిపేరిమి జన్నవెట్టి, స
ల్లలిత రసాను భావములు
　లాస్యములాడుచు తీపులెత్త, ఓ
వలపుల పల్లవుండ !
　భవభావనిబద్ధవిరాగజీవినై.

పెదవిని వేణువూని
సుమ్రవేళుల కోనలు సంచరింపుచున్
పదమునడింపగా,
పులకవారె కదంబవనమ్ము, వెన్నెలల్
పొదివె తమాలవాటి,
రుచిపూరము పొంగులువారె, నాయెదన్
మెదిలె వియుక్త గీతికల
నీరవజీవిత వేదనాస్మృతుల్.

తెలివాలుకన్నులు
హాసించిన గొజ్జగిపూలవాసనల్
శీత మయూఖరేఖ
విరచించిన తావుల జల్లులాడె, వాం
ఛాలపనీయ సూనముల
సౌరభముల్ తళుకార్చికొన్న ప్రా
భాత మనోజ్ఞతల్ మెఱసి
పర్విడి పోవగ వెల్గునీడలన్.

కనుకొనలన్ చిగిర్చిన
    చకచ్చకితామర కాంతి పిచికల్,
మునుకొని విశ్వమున్
    కలయముంచు, విలీనమైన మాధురుల్
సోనలుగ జాలువారు
    నవశోభన వీధుల, కౌగిటన్ కరం
గిన మృదు రాగముల్ తొణకు
    క్రేగనులన్ తరలించి పోవుచున్.

తారెడు కావినీడలసుతారపు
    తూరుపుకొండ వేగులో
కోరకితమ్ములై, ఎవరి కోసమొ
    సన్నగ జారిపోయి, శో
భారమణీయమై వలపు
    పట్టిన తావుల తావులద్ది, ఈ
శారద వేళ లన్నవకిసాలయ
    మంటు సుధాంకితమ్ముగా.

తీయని చంద్రికా విమలతీర్థము
లెల్లెడ జల్లులాడగా
నాయెద విచ్చుకొన్న
యధునాతన గీతికలూ రకేవ్యథా
చ్ఛాయల పేరుకొన్నవి,
విషాదపయోధర మేదురమ్ములై.
పోయినవేల, నాకిక
నభోదివసమ్ములె జీవితాంతమున్.

చీకటి వెల్లుకౌగిళుల
చిక్కిన నేను నిశాదివమ్ములున్
నీకయి రాగరంజిత వినిర్మల
భావవిలీనకాంక్ష, నే
నాకిగ వేగుచుంటి,
పరికల్పిత శోభిత జీవితమ్ము, వే
జోకనె యూర్పుగా విడిచి పుచ్చితి,
దేయుషదోపజీవినై.

పూర్తి